# కేసరి రత్నత్రయము

## లోధ్ర

గర్భాశయరోగనివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్ఠు కాకుండుట, అకాలబహిష్ఠు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-4-0 6 ఔ. రు. 2-4-0

## అమృత

రక్తశుద్ధిద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సునయిచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-4-0 6 ఔ. రు. 2-4-0

## అర్క

సర్వజ్వరనివారిణి

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికూటము చేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమను జ్వరగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డి రూ. 1-2-0

తపాలా ఖర్చులు ప్రత్యేకము

**కేసరి కుటీరం లిమిటెడ్**

ఆయుర్వేద ఔషధశాల

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజామునకు, ఏజంట్లు :

సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు.

విశాలాంధ్రలో జూలై **10**వ తేదిన విడుదల



## సొసైటీ పిక్చర్సువారి

# ప్రపంచం



అపూర్వమైన కథ ★

అమోఘమైన కళ ★

శ్రావ్యమైన సంగీతం ★

సినిమా ప్రపంచంలో
ఒక నూతనప్రయత్నం

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు

డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౨] జూలై 1958 [సంచిక ౭

# విషయ సూచిక



ముఖచిత్రం : బేబికమల

కళాశాలకు లక్షరూపాయలు విలువగల 100 యకరములభూమిని దానమిచ్చిన శ్రీ చింతలపాటి సీతారామ చంద్రమూర్తిరాజుగారు, ఆయన సతీమణి శ్రీమతి సత్యవతీదేవిగారు

శ్రీమతి చింతలపాటి సత్యవతీదేవిగారిపేర స్థాపించబడిన స్త్రీల కళాశాల నూతన భవనము




జయజయ గృహలక్ష్మీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# ప్రాథమిక విద్యా సంస్కరణలు



మద్రాసు ప్రభుత్వము అమలుపరచ తలపెట్టిన నూతన ప్రాథమిక విద్యా విధానం విశేషంగా విమర్శకు గురియగుచున్నది.

విమర్శకుల దృష్టిలో యీ నూతన విధానం కులతత్వాన్ని ప్రోత్సహిస్తున్నదనియు, బాలబాలికల విద్యాభివృద్ధి సన్నగిల చేస్తుందనియు వారి వాదం.

పూర్వచరిత్రను బట్టిచూస్తే వృత్తులనుబట్టియే కులాలు ఏర్పడినమాట వాస్తవము. కాని ఆర్యుల కాలంలో నిత్యజీవితంలోని కార్యకలాపములు నిర్విఘ్నముగా నెరవేరుటకుగాను కొన్ని వర్గాలుగా ఏర్పడవలసివచ్చింది. వారే యీనాటి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. ఆదిలో ఉత్తమ, నీచకులాలనే విచక్షణయుండేది కాదు. ఎవరి ధర్మాలనువారు నిర్వహిస్తూ ఏకోన్ముఖంగా దేశశ్రేయస్సును దృష్టిలో నుంచుకొని జీవితంగడిపేవారు. కాని క్రమంగా పరిస్థితులతోబాటు వాతావరణంమారింది. కులమత తత్వాలు వికృతరూపంతాల్చి వివాదాలకు, రచ్చలకు, కడకు యుద్ధాలకు దారితీసినవి. అంతేకాని ఆర్యులనాటి ఆదికుల విభజన సదుద్దేశములతోనే జరిగింది.

ఈ రోజులలో కులమతవర్గ తత్త్వాలు నాశనమయి ఐకమత్యంతో సంఘ శ్రేయస్సుకు కృషి చెయ్యాలనే నినాదం స్వధర్మాలకు స్వస్తిచెప్పి బాధ్యతా రహితంగా వ్యవహరించడానికి ఏర్పడిందికాదు; ఉత్తమనీచములనే విభేదాలుతొలగి సంఘములో సమానగౌరవ ప్రతిపత్తులకు పాత్రులుకావలెననే వాదమును బలపరచడానికి ఈ పరిస్థితులలో వివిధకులాలవారు వారివారి స్వధర్మాలను నిర్వహించడంలోతప్పేమీలేదు.

ప్రవేశపెట్టబడిన నూతన ప్రాథమిక విద్యావిధానంలో అర్ధరోజు విజ్ఞాన వికాసములను పెంపొందింపచేయు విద్య పాఠశాలలో నేర్పబడుతుంది. మిగిలిన అర్ధ రోజును బాలబాలికలు తమతమ తండ్రులు అవలంబించుచున్న వృత్తులలో శిక్షణకని నిర్దేశించబడింది.

ఇందులో ఒక లోపం కనుపిస్తున్నది. బాలబాలికలు తమతమ తండ్రు లవలంబించే వృత్తులలో శిక్షణయనేది పాఠశాలలలోనే క్రమశిక్షణాపూర్వకంగా సమకూరిననాడు ప్రభుత్వ ఆశయం సిద్ధిస్తుందికాని స్వేచ్ఛావాతావరణంలో సత్ఫలితాలు సమకూరజాలవు. పైగా రెండుపూటలు బడికిపోయి చదువుకొంటుంటేనే విద్యాభివృద్ధి సమకూరని అధికసంఖ్యాక బాలబాలికలకు అర్ధరోజు బడికిపంపి మిగిలిన అర్ధరోజు స్వేచ్ఛావాతావరణంలో వదలినచో విద్యాభివృద్ధి సన్నగిలుతుందనుకోడానికి అవకాశములు లేకపోలేదు.

ఇక ముఖ్యంగా బాలికల విషయం గమనించినచో వారికి లలితకళలు, పాకశాస్త్రం, కుట్టుపని, గృహాలంకరణ మొదలగువానియందు శిక్షణయవసరం. ఈ నూతన విధానంలో బాలికలకు వానిని సమకూర్చడానికి ప్రభుత్వము పాఠశాలల యాజమాన్యముననే ఏర్పాట్లు చెయ్యాలి.

తమ తండ్రులు ప్రత్యేకంగా ఏవృత్తిని అవలంబించని విద్యార్థులు తమ అభిరుచి ననుసరించి ఏ ఒక్క వృత్తిలోనైనా పరిచయము సంపాదించుకొనడానికి ప్రభుత్వము అవకాశము కల్పించాలి.

ఈ సందర్భములో మద్రాసు ప్రభుత్వపు ఆశయము సిద్ధించి సత్ఫలితాలు సమకూరాలంటే వృత్తులలో శిక్షణకని నిర్దేశించబడిన అర్ధరోజులో బాలబాలికలకు శిక్షణను పాఠశాలలోనే సమకూర్చవలెను. అలాకాని పరిస్థితులలో విద్యాభివృద్ధి దానిననుసరించి విజ్ఞాన వికాసముల వ్యాప్తి తృప్తికరముగా నుండజాలవు.

# ఢిల్లీ ఆంధ్రుల సంతాపం

న్యూఢిల్లీనగరంలో శ్రీ రామచంద్ర అగస్త్యగారి వసతిగృహంలో 21-6-53 నాడు జరిగిన ఆంధ్రుల సమావేశములో పలువురు పెద్దలు పాల్గొనిరి. అనేకమంది శ్రీ కేసరిగారి ప్రజాసేవను ప్రశంశించుచు జోహారు లర్పించారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ మాచిరాజు సీతాపతిరావుగారు ఉపన్యసిస్తూ కీ. శే. కేసరిగారి జీవిత విశేషములను వివరించి ప్రజాసేవాతత్పరుడనియు, వారు మహిళా లోకానికిచేసిన సేవ అపారమనియు, చేసిన దానధర్మములు శాశ్వతయశస్సును సముపార్జించినవని చెప్పిరి.

శ్రీ యస్. రామచంద్ర అగస్త్యగారు ఉపన్యసిస్తూ ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క మహాత్మునిచేత సంస్కృతమును, గ్రీకువాఙ్మయము, లాటిన్ భాష, ఆంగ్లభాష, తెలుగుభాషలు పోషించబడినవిగాని స్త్రీలను ప్రత్యేకంగా గౌరవించలేదనియు, శ్రీ కేసరిగారు స్త్రీలను అన్నిరంగాలలో ప్రోత్సహిస్తూ చేసినకృషి ప్రశంస నీయమన్నారు. ముఖ్యంగా తమ గృహలక్ష్మి పత్రికద్వారాను, గృహలక్ష్మి స్వర్ణకంకణప్రదానమువలనను నారీమణులను సాహిత్యంలోను, కవనంలోను, సంఘసేవలోను, గానవిద్యలోను, చివరకు వంటపనిలోను ప్రోత్సహించారు. మద్రాసునగరంలో తెలుగు చదువుకునే బాలబాలికలకు విద్యాసౌకర్యాల కొరత ఏర్పడిన సందర్భమున నడుంకట్టి విద్యాలయములను స్థాపించి 2 లక్షలరూపాయలను విరాళమిచ్చారు. శ్రీ కేసరిగారిది నిష్కల్మషహృదయం. మితభాషి, కార్యశూరుడని చెప్పి వారినిర్యాణము ఆంధ్రలోకానికి మితిలేనివిచారమును కలిగించినదన్నారు.

ఈ క్రిందిసానుభూతి తీర్మానాన్ని, సభవారు ఏకగ్రీవంగా ఆమోదించారు.

"యశసంపన్నులు, దేశసేవాపరాయణులు, కేసరి రత్నత్రయంద్వారా లక్షలాదిగా సంపాదించి, దాన ధర్మాలుచేసి సమస్తప్రజాభివృద్ధిని ఆకాంక్షించి, జీవితమును ధన్యముగావించుకొని, కీర్తిశేషులైన ఆంధ్రమహా పురుషుడు డాక్టర్ కె. ఎన్. కేసరిగారికి ఆత్మశాంతి చేకూరుగాక! యని ప్రార్థించుచున్నారు.

♦ ♦ ♦

కీ॥ శే॥ డాక్టరు కే. యన్. కేసరిపంతులుగారి మరణమునకు ఈ సమాజము వారు చింతించుచూ ఈ క్రింది తీర్మానము గావించిరి.

"సమాజముయొక్క ప్రారంభికదశనుండి మరణాంతమువరకు సమాజసభ్యులుగా నుండి, గ్రంథాలయమునకు, అనేక పుస్తకములును బీరువాను బహూకరించినట్టియు, ఇచ్చట జరిగిన మొల్లజయంతులలో 'గృహలక్ష్మి స్వర్ణకంకణము'ను ప్రసాదించినట్టియు, సమాజ శ్రేయోభిలాషులు శ్రీ డాక్టరు కే. యన్. కేసరిగారి మరణమునకు సమాజము పక్షమున సానుభూతి తెలుపడమైనది."

నెల్లూరు వర్ధమాన సమాజము

# లోక కల్యాణాన్ని ప్రోత్సహించిన

## కీ. శే. డాక్టర్. కే. యస్. కేసరిగారు.

—(o)—

శ్రీ కేసరిగారు స్వయంకృషివల్లనైద్యవృత్తిచే సంపన్న గృహస్థులయినది మొదలు, బీద విద్యార్థులకు, బీదలకు, ఆశ్రితులకు, చేయదగిన యితరులకు వారివారి యోగ్యతలకు తగినట్లు సహాయముచేసి వారి ఆదరాభిమానములకు పాత్రులయిరి. తరువాత కొందరికి జీవనభృతి చూపియు, గృహవసతి కల్పించియు, వుపనయన వివాహాది కార్యములు చేసియు కీర్తికెక్కియున్నారు. ఇదిగాక చెన్నపట్నమునందలి తెలుగు విద్యాసౌకర్యములులేక కష్టపడుచున్న బాలబాలికలకు వున్నత విద్యకొరకు లకలకొలది ద్రవ్యము దానముచేసి విద్యాలయములు నిర్మించి, అపారమైన చిరస్థాయిగావుండు విద్యాదానము చేసినారు.

వారికి తమ మాతృభాష అయిన తెలుగుభాషను అభివృద్ధిచేయుటకు వారు విద్యాలయములద్వారాను, పుస్తకరచనద్వారాను, సచిత్రమాసపత్రికయయిన గృహలక్ష్మి ద్వారాను కృషిచేసినారు.

వారి స్వవిషయములోనైననేమి, యితరత్రబంధుమిత్రుల విషయముననేమి, వారి మాటచెల్లు ఎట్టిచోటనైనను గృహలక్ష్మిద్వారా వారి సంపాదకీయములందు వారు వివరించిన అభిప్రాయమును గుణ్యముగా సంఘసంస్కరణకు పాటుబడినారు.

కొందరు దిక్కులేనివారిని చేరదీసి వారికి తగినసహాయముచేసి వారి అభివృద్ధికి పాటుబడినారు.

స్త్రీల అభివృద్ధికొరకు పాఠశాలల నేర్పరచుటయేగాక, స్త్రీల పేరటగృహలక్ష్మిని స్థాపించి, అందు స్త్రీలవిషయము యెక్కువగా ప్రచారముచేయుచు, స్త్రీ సాహిత్యమునకే ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి, ఏటేటా కంకణసమర్పణ మహోత్సవములు జరిపి స్త్రీలకు ఎక్కువ గౌరవము కలుగజేయుటయే యిందుకు నిదర్శనము.

కళలన్నవారికుండు ఆదరణ ఎక్కువ—సంగీతకళాదరణలో వారు శర్మసోదరులకు యిచ్చిన సహాయము, వారి అభ్యున్నతి, స్వర్గీయ బెంగుళూరినాగరత్నమ్మ మొదలగు గొప్ప గాయక మహాశయుల పొగడ్తలేసాక్షి. వారునిర్మించిన వివిధరకములైన భవనములు, వుద్యానవనములు, లతాగృహములే సాక్షి.

వైద్యవిద్యనభ్యసించి మంచిఅనుభవము అలవడినతర్వాత సర్వప్రపంచములో స్థిర స్థాయిగ నిలచిన నిలచియున్న విలువగల కేసరి రత్నత్రయము అర్క, అమృత, లోధ్ర మొదలగు అనేక ఔషధరాజములే సాక్షి.

వారు స్థాపించిన ఉన్నత పాఠశాలలను తగు సమర్థులయిన పెద్దలచేతికి పెత్తన మిచ్చి, తామందు నామమాత్రమయిన సంబంధము వహించక ఆ విద్యాలయములు స్థిర స్థాయిగా నుండునట్లు చేసినారు.

వారు గొప్ప గౌరవనీయులని వారుబ్రతికియున్నంత కాలము గొప్పగొప్ప వారిచే గౌరవములంది, కీర్తిశేషులయిన తర్వాతవారి సంగ్రహచరిత్రను రేడియోద్వారాను, పత్రి కల ప్రధాన వ్యాసములద్వారాను స్మారక సభలద్వారాను సమ్మతికెక్కుటే సాక్షి.

ఇట్టి మహానుభావులయిన శ్రీ కేసరిగారు భారద్వాజసగోత్రమందు కోటవారి కుటుంబములో జనించి యింతటి గొప్పకీర్తిని సంపాదించి ఆవంశములను పావనము చేసినటువంటి పుణ్యచరిత్రుడు. మనలనందరిని వీడిపోయినందుకు బంధువులలోగాని, స్నేహి తులలోగాని, తెలిసినవారిలోగాని స్త్రీసమూహములోగాని విలపించనివారు, భావి ఆంధ్రోన్నతికి వారి అకాలమరణమువల్ల కలిగిన నష్టమునకు చింతించనివారు వుండరు.

అట్టి ఆ మహాశయుని ఆత్మకు పరమేశ్వరుడు శాంతినిచ్చునట్లు మనమందరము ఆ పరమాత్మను ప్రార్థించవలయును.

కోట విశ్వనాథం

—— —— (o) —— ——

# మనవి

రాబోయే సంచికనుండి "మనదేశభాషలకు నాగరలిపి" అనే శీర్షికక్రింద అను కూల ప్రతికూల వాదములను ప్రచురింప దలిచాము. రచయితలు, రచయిత్రులు, విద్యావేత్తలు తమ వాదములను సహేతుకముగా, క్లుప్తముగా వ్రాసి పరిపితే సంతోషపూర్వకంగా ప్రచురిస్తాము.

సంపాదకుడు

 # తీరని కోరిక 

శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణదేవి

"నాన్నా నాకుపెండ్లివద్దు" అంది సుశీల తన తండ్రితో. ఏమిటమ్మా అలా అంటున్నావు. నిన్ను అవివాహితగా ఉంచితే సంఘం నన్ను దూషించదూ! నేను నల్గురిలో ఎలా తలెత్తుకు తిరగ్గలను ? ఎవరినో వొకరినిచూచి నీవు ముడిపెడితేతప్ప నాకు బాధ తీరి నట్లుండదమ్మా" అన్నాడు తండ్రి రామయ్య.

సుశీల:_అదికాదు నాన్నా ! మీరు నన్ను ప్రేమిస్తున్నారా ? సంఘాన్నా ? మీరు నన్ను ప్రేమిస్తుంటే సంఘాన్ని ఎదిరించండి. ఏమి ఒక స్త్రీ అవివాహితగా ఉన్నదంటే సంఘంలో గుసగుసలు బయలుదేరుతాయి. పురుషుడు అవివాహితుడుగా ఉన్నాడంటే సంఘం నోరే మెదపదు. స్త్రీకికూడ హృదయముందని నేను నిరూపించగలను. నాన్నా మీరు నా పెండ్లికిచేయుఖర్చు నా చదువుకుపయోగించండి. నా వలన మీరు ఏ అపకీర్తి పొందరు. నా కోరిక మన్నించండి. అన్నయ్యకు చెప్పించినట్లు నాకుకూడ చదువు చెప్పించితే ఇప్పటికి ఎంతో చదువు చదివేదాన్ని. ప్రతి స్త్రీ పురుషునితోపాటు డిగ్రీలు పొందాలనికాదు నా ఉద్దేశ్యం. విద్యాతృష్ణగల నా లాంటి స్త్రీలకు చదువుకునే అవకాశమిచ్చి స్త్రీల ప్రతిభను వికసింపచేయాలని నాకోరిక. నేను నా భావిజీవితములో చేయవలసినవి ఎన్నో ప్లానులు వేసుకొనియున్నాను. వాటన్నిటిని "గాలిమేడలు" చేయవద్దు.

రా:_అమ్మా ! సుశీలా ! అదికాదు; స్త్రీ అవివాహితగా ఉండుట మన మత ధర్మంకాదు.

సు:_మతముపేరు చెప్పి నా మనస్సు మార్చ చూస్తున్నారా ? నాన్నా ! అవివాహితగాఉండి అఖండ బ్రహ్మచర్యమునకు తన జీవితమును అంకితముచేసిన హిందూ స్త్రీ గార్గిని మఱచిపోయానుకున్నారా ? లేక మీరు మఱచిపోయి అట్లు మాట్లాడుతున్నారా ?

రా:_మాటలతోపనిలేదు. చేతనైతే నీ బిడ్డలను నీ ఇష్టమొచ్చినట్లు తయారుచేసుకోవచ్చు. కాని నీపై నాకు పూర్ణాధికారమున్నది కాబట్టి నేను నీ పెండ్లిచేసితీరుతాను. నన్ను నల్గురిలో నవ్వుల పాలుచేయకు.

అదివిన్న సుశీల ఇక అక్కడ ఉండలేకపోయింది. మెల్లగా గదిలోనికి వెళ్ళింది. ఆమెకు ప్రపంచమంతా అంధకారంగా తోచింది. తను ఒక కుగ్రామంలో జన్మించింది. ఆ గ్రామం నాగరికతలో చాల వెనుకబడియున్నది. స్త్రీ విద్యంటే వారికి దాని విలువ తెలియదు. తమ సంతానాన్ని ఏవిధంగా పెంచవలసింది, తమ పసిబిడ్డలను ఏవిధంగా ఉంచవలసిందికూడ వారికి తెలియదు. అందువలన తను ఆ గ్రామాన్ని అభివృద్ధిలోకి తేవాలని ఊహించింది. తనను తన తండ్రి చిన్నతనంలో పెద్దగా చదివించలేదు. తన మేనమామల ఇంటిదగ్గరే 5, 6 తరగతుల వరకు చదువుకుంది. ఆ రోజుల్లో తనకు చదువుమీద అంత ప్రేమకూడ ఉండేదికాదు. కాని ఇప్పుడు తనకు దేశకాల పరిస్థితులు అవగాహనమయ్యాయి. మొన్న తను మేనమామగారింటికి వెళ్ళినప్పుడు ఆ పక్కింటి సుబ్బయ్యగారి అమ్మాయిలిద్దరూ బి. ఏ. వరకు చదువుకున్నారు. ఎంతో సరదాగా ఉంటారు. గ్రామంలోని అవిద్యావతులైన స్త్రీలకు విద్య చెప్పటంటే వారికి చాల ప్రీతి. ప్రతి నిముషంవారు స్త్రీ విద్యా వ్యాప్తికి, స్త్రీ శ్రేయస్సుకే ఉపయోగించ ప్రయత్నిస్తారు. వారివలన ఆ గ్రామంలోని స్త్రీలు ముందుకు రాగలిగారు. ఆ స్త్రీలకు స్వాతంత్ర భారతదేశంలో వారికిగల పౌరహక్కులు, వారి బాధ్యత బాగా విపులీకరించి చెప్పుతారు. వారి వలనే తనకుకూడ ఈ విద్యాతృష్ణ కలిగింది. తనుకూడ చదువుకొని తన గ్రామాన్ని విద్యాకేంద్రంగా మార్చ ఉవ్విళ్ళూరింది. కాని తన తండ్రి ఇంత నిరాశాపూరితమైన జవాబిస్తాడని అనుకోలేదు. తన తండ్రి కొద్దో గొప్పో చదువుకున్నప్పటికి ఆయన దృష్టిలో స్త్రీ విద్యకు విలువలేనందుకు చాల విచా

రించింది. తన ఊహలన్నీ గాలిమేడలయ్యాయని ఒక్క నిట్టూర్పు విడచింది. కాని తన వివాహానంతరమైన తన పతిదేవుడు అనుమతించితే స్త్రీలలో కొంతవరకైనా చైతన్యము తేగలనని తనను తను ఊరడించుకున్నది.

రామయ్య ఇక తన కూతురి పెండ్లి చేయకపోతే తన మాట మీరిపోతుందని భయపడ్డాడు పాపం! కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు ఒక సంబంధం కుదుర్చుకొచ్చాడు. అతనికి షుమారు 50 సంవత్సరముల వయసు ఉంటుంది. ఆస్తయితే 4 లక్షల వరకు ఉంటుంది. ఇదివరలో ఒక భార్య నిస్సంతానముతోనే గతించింది. వయస్సు ఎంత ఉన్నప్పటికి చదువుకున్నవాడు, ఆస్తికలవాడు కాబట్టి అదృష్టముంటే తన కోరిక నెరవేరగలదని సంతోషించింది. ఇక తన చదువుకూడా కొంతవరకైనా సాగిపోగలదని ఉవ్విళ్ళూరింది అమాయక ప్రపంచంలోని సుశీల.

సుశీల వివాహమై అత్తవారింటికి వచ్చింది. కాని ఇక్కడకూడ తన కోరిక "తీరనికోరిక"గానే పరిణమించింది. ఒక రోజున సుశీల ఎంతో వినయముతో తన విద్యాతృష్ణ ప్రకటించి తన కోరిక తీర్చవలెనని ప్రార్థించింది. అందుకు భర్త "నీ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించవచ్చుని ఇది ఒక వంక దొరికిందా? ఇక్కడ నీ ఆటలు సాగవు. ఇంటిలోనుండి బయటకు అడుగుపెట్ట వీలులేదు"ని శాసించాడు. ఆ మాటలతో సుశీల ఆశలన్నీ అడియాసలైనాయి. ఆమె నిర్మించుకున్న ఊహాసౌధములన్నీ గాలిమేడలైనాయి. సుశీల ఎవరితోనైన మాట్లాడిందంటే ఆయనకు పెద్ద అనుమానము. ఎవరితోను మాట్లాడగూడదు. ఆమెను బయటముఖం చూడనివ్వడు ఆ మూర్ఖుడు. ఆ ఆస్తిమీద తనకేవిధమైన అధికారము లేదు. ఆ విశాలమైన భవనములో ధన సంకెళ్లతో బంధింపబడ్డది నిస్వార్థయైన సుశీల. స్త్రీలతో మాట్లాడినప్పటికి ఆమె కెవరో ఏదోచెప్పి పాడుచేస్తారని అతనికి పెద్దభయం. తన ఇష్టమొచ్చినట్లు ఊరంతా తిరిగి సకలభోగాలనుభవించి అర్ధరాత్రికి ఇంటికివస్తే అప్పటివరకు పాపం! సుశీల ఒక్కతే ఇంట్లో బిక్కు బిక్కు మంటూ ఉండాలి.

స్వతంత్ర పిపాసియైన సుశీల ఎంతధనమున్నప్పటికి అస్వతంత్రమైన జీవితానికి తృప్తిపడలేదు. ఆమెకు తన భర్తనడత ఏమినచ్చలేదు. అతని హృదయములో అభ్యుదయభావాలు కంచుకాగడాపెట్టి చూచినా కనుపించవు. తనకు వివాహమై 5 సంవత్సరములైంది. కాని ఇంతవరకు సంతానము కలగలేదు. తన ఆశయాలను ఆచరణలో పెట్టే ఆస్కారములేదు. ఇక తను ఎవరికొరకు జీవించాలి. దుర్మార్గుడైన భర్త కొరకా? అవును-సంఘానికి కట్టుపడితే ఎలాంటి వాడైనా భర్త కొరకు జీవించుట భారత స్త్రీ పవిత్ర ధర్మం. కాని ఏ విధంగా ఆలోచించిన ప్రగతివాదియైన సుశీలకు మనశ్శాంతి కలుగలేదు. ఆమెలోని ఇదివరకటి ఉత్సాహం గతించింది. తన సంఘంలో ఇంకను కరుడుకట్టియున్న కుళ్లునుచూచి కుములుతూఉంది. తల్లిదండ్రులు మంచికోరుతారంటారు. వారిదృష్టికి ధనమే ప్రప్రథమంగా తగుల్తుంది. తమబిడ్డ ఏడంతస్థుల మేడమీద మసలుతూ ఉందని సంతోషిస్తారు. కాని వారస్వేచ్ఛ సుఖముండుటే ప్రధానంగా భావించరు. ఇక నేను ఈ సంఘంలో ఈ విధంగా బద్ధింపబడి జీవించలేను. మరొక జన్మలోనైన భగవంతుడు నా కోరిక తీర్చుగాక! అని భగవంతునియందే నమ్మకముంచుకొని ఆమె తన దుఃఖజీవితాన్ని అతి భారంతో వెళ్లబుచ్చుతూఉంది.

కొన్ని రోజులు గడచాయి. సుశీల చిక్కి శల్యమై పోయింది. ఆమెకు ఇప్పుడు జ్వరముకూడ వస్తూ ఉంది. ఎందరు డాక్టర్లు వచ్చినను ఆమె వ్యాధితిరుగు ముఖముకాలేదు. ఇక సుశీల జీవించు ఆశలేదు. ఆమెను చూచుటకు తల్లి - తండ్రి అన్న, తమ్ముడు అందరూ వచ్చారు. అందరూ దుఃఖసముద్రంలో మునిగియున్నారు. సుశీల ఒక్కసారి తండ్రివైపు చూచి ఇలా అంది:- నాన్నా! మీరు సంఘాన్ని ప్రేమిస్తున్నారు. దాని ఆజ్ఞానుసారము నన్ను వివాహితను చేశారు. మీరు ధనమును ప్రేమిస్తున్నారు. ధనవంతురాలను చేశారు. కాని నాకు ఇక్కడ ఎలాంటి అధికారములేదు. నేను లోకానికి ఒక ధనవంతురాలనేకాని దానాధర్మము చేయుటకు చిల్లి కాని దగ్గరకూడా నాకేవిధమైన అధికారములేదు. తినుటకు, దాన్ని చూచి ఆనందించుటకే గాదు దానిని సద్వినియోగము చేయుట చేతకావాలి. మీ కోరిక తీర నేను వివాహితగా ధనవంతుని భార్యగా యున్నాను. ఇదేవిధంగా వెళ్ళిపోతున్నాను. ఈ జన్మలో నా కోరిక "తీరని కోరిక" గా మారింది. మరో జన్మలో విద్యావంతురాలనై స్త్రీ సమాజం లోని యువ సభ్యురాండ్రను చేతనైనంతవరకు విద్యావతులను చేయప్రయత్నిస్తా; గార్గిలాంటి విదుషీ మణులను తయారు చేస్తానంటూ కన్ను మూసింది. అక్కడఉన్న బంధువర్గమంతా ఒక్కసారి గొల్లు మన్నది. అలాంటి ఉత్తమ స్త్రీని పోగొట్టుకున్న స్త్రీ సమాజంకూడ ఆమెకు అశ్రువులతో అభిషేకం చేసింది.



# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## జంగం కథ

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

### మునీశ్వరుడు

ప్రాచీన కథల కొన్నిటిలో మునీశ్వరుడిపాత్ర ఒకటి ఉంటుంది. కాంభోజరాజుకథలో కాంభోజ రాజు ఆరుగురి కొడుకులు నిర్మలమందు తేవడానికి బయలుదేరి కర్ణాటకభూమికివచ్చి ఒక మునీశ్వరుణ్ణి చూసి అతన్ని అమర్యాదచేసి అతనివల్ల ఉపకారం గాక అపకారం పొందేరు. బాలనాగమ్మ కథలో లక్ష్మీదేవి సంతానంకోసమని తపస్సు చెయ్యడానికివెళ్లి నాగమునీంద్రుని సలహా పొందింది.

కొన్ని కథలలో ఇది కొంతమార్పు చెందింది. పాత్రలే నేరుగ భగవంతుణ్ణి ప్రార్థించి సంతానం పొందుతారు. నల్లతంగాళ్ తలిదండ్రులట్లే సంతానాన్ని పొందేరు. గాంధారి కథలో గాంధారితల్లి శ్రీశైలంమీద తపస్సుచేసి గాంధారినికన్నది. కుమారరామునికథలో కుమారరామునితల్లి శ్రీరాముల వారి పర్వతానికివెళ్లి తపస్సుచేసి సంతానవంతురాలయింది. చిన్నమ్మ పల్నాటి వీరచరిత్ర, బంగారు తిమ్మరాజుకథలలోకూడ అట్లే.

### నాగేంద్రుడు

అనేక జంగం కథలలో నాగుపాము వస్తుంది. ఆంధ్రులు నాగజాతివారని చరిత్రకారులు చెప్పుతున్నారు. వారు క్రీస్తు పూర్వమంటేగాక ఇటీవల కూడ ప్రముఖులుగా ఉన్నారు. చక్రకోట్య మండలం అనగా బస్తరు (మధ్యప్రదేశ)లో నాగరాజులు క్రీ॥ శ॥ 1325 వరకు రాజ్యంచేసేరు. * ఈ అంశాన్ని జంగం కథలుకూడ బలపరుస్తున్నాయి. కాంభోజరాజు తండ్రి అడివిని కొట్టిస్తూండగా అందులో ఒక నాగుపాము కనబడింది. దానిని ఆయన చంపించేశాడు. అది కారణంగా కాంభోజ రాజుకి సంతానం లేకపోయింది. ఆ కథలోని నాగుపాముకి తొమ్మిది శిరస్సులే ఉన్నాయి. దానికి పరిశోధన అవసరం. ఎందుచేతంటే ఈ నాగేంద్రులకు పన్నెండు శిరస్సులుండడం ఈ కథలలో సాంప్రదాయం.

బాలనాగమ్మకథలోకూడ నాగుపాము మూడుసార్లు వస్తుంది. ప్రతిదానికి పన్నెండు శిరస్సులు తప్పదు. లక్ష్మీదేవి అడవిలో మామిడి చెట్టెక్కి పళ్లు కోసుకొంటూన్నప్పుడు నాగమువచ్చి ఆమెను చంపుతానంటుంది. కాని ఆమె ప్రార్థించగా అప్పటికి ఊరుకొంది. బాలవర్ధిరాజు ఫకీరు కోసం వెళుతూండగా నాగేంద్రుడు ఎదురయేడు. సముద్రతీరాన బాలవర్ధిరాజు కూర్చుండగా ఒక పెద్ద పాము పెద్దచెట్టు ఎక్కుతూండగాచూసి చంపేడు. ఈ పాములలో కొన్నిటికి మహత్తుఉంది.

ఈ నాగేంద్రుడు నిజంగా పాము అయివుండదు. నాగజాతివారు అనుపేరుగల అనార్యులున్నారు. వీరికి, ఆర్యాంధ్రులకు తరుచుగా సంఘర్షణలు జరుగుతూండేవని మనం పూర్వచరిత్రలో చూడవచ్చు. కాబట్టి ఈ సంఘటలు ఆ నాగజాతివారి ప్రశంశే కావచ్చు. నాగజాతివారి విగ్రహాలు అనేకం తెలుగుదేశంలో కనబడుతాయి. అవి మనిషి ఆకారంగాఉండి తలమీద కొన్ని పడగలు కప్పినట్లుగా ఉన్నాయి. అనార్యులు అనేక రకాలుగా వేషాలు వేసుకొనేవారు, అలంకారాలు చిత్రించుకొనేవారు. నాగజాతివారు తమ తలలమీద పడగల ఆకారంగల అలంకారాలను ధరించి ఉండడంవల్ల వీటినిచూసి ఆర్యాంధ్రులు, వీరిని నాగుపాములని వర్ణించి ఉండవచ్చు. జంగంకథలలో నాగేంద్రుడి ప్రశంస మొట్టమొదట కాంభోరాజుకథలోనే ఉంది.



2

నాగేంద్రుడికి ఇటు తర్వాత చెప్పబడే నాగంభట్టుపేరుకి కొంతసంబంధముండవచ్చు.

* కాకతీయాంధ్ర యుగరాజు చరిత్రము - చిలుకూరి వీరభద్రరాయ కృతము - మూడో ప్రకరణం.

## నాగంభట్టు ; నాగమ్మ

నాగంభట్టు అను పేరుగలపాత్ర అనేక జంగం కథలలో వస్తుంది. కుమార రాముడి కథలో కుమారరాముడి, అతని తమ్ముడి గురువు నాగంభట్టు. గాంధారికథలో సుహితరాజుకి ముహూర్తం నిర్ణయించిన బ్రాహ్మణుడు నాగంభట్టు. బాలనాగమ్మకథలో బాలరాజుని మోసంచెయ్యదలచినవాడు నాగంభట్టు. కొన్ని జంగంకథలలో నాగేంద్రుడు రాడు. ఆ స్థానాన్ని నాగంభట్టు పుచ్చుకొన్నాడా అనే సందేహం కలగకమానదు. నాగేంద్రుడు, నాగంభట్టుకూడ బాలనాగమ్మకథలో కనబడుతున్నారు. మిగత కథలలో సాధారణంగా ఎవరో ఒకరే వస్తున్నారు.

చిన్నమ్మకథలో నాగుపాము లేదు ; నాగంభట్టు లేడు, నాగమ్మ అనే దుర్మార్గురాలొకతె బయలుదేరింది. పల్నాటి వీరచరిత్రలో నాగమ్మ మహాప్రసిద్ధిపొంది నాయకురాలయింది. ఆమె పేరుకూడ ఈ సంప్రదాయానికి చెందినపేరే !

## ద్రోహబుద్ధి

జంగంకథలలో ద్రోహబుద్ధిగల ఒక ముఖ్యపాత్రగానిలేక అనేక చిరపాత్రలుగాని ఉంటాయి. కాంభోజరాజుకథలో ద్రోహబుద్ధిని కొందరు పంచుకొంటారు. కాంభోజరాజు ఆరుగురు రాణులు, ఆరుగురు కొడుకులు ఆ దుర్గుణాన్ని పంచుకొన్నారు. వారిలో కొందరు మాణిక్యదేవిని మరికొందరు చెరబందిరాజును బాధలపాలుచేసేరు. నల్లతంగాళ్ కథలో నల్లతంగాళ్ వదినగారు ద్రోహిని. చిన్నమ్మకథలో ఆమె అత్తవారికుటుంబమంతా ద్రోహంచేస్తారు. బంగారు తిమ్మరాజుకథలో బోగం రంగసాని, ఆమె అన్న కలిసి ద్రోహులు. బాలనాగమ్మకథలో ఫకీరు రావణాసురుడిలాంటివాడు. దేశింగురాజుకథలోను, బొబ్బిలిరాజుకథలలోను కథానాయకులకి శత్రువులు, ద్రోహులు. సన్యాసమ్మకథలో ఆమె అత్తవారి కుటుంబమంతా, ఒకరిద్దరు మినహాగా ద్రోహం చేస్తారు. కామమ్మకథలో కామమ్మని విధే కష్టాలపాలు చేస్తుంది. కుమారరామునికథలో ప్రత్యేకంగా ఒక్కరని చెప్పలేము. గాంధారికథలో గాంధారితల్లే కుమార్తెకు ద్రోహం తలపెట్టింది.

## మాణిక్యమ్మ

మూడునాలుగు జంగంకథలలో మాణిక్యమ్మపేరు విధిగా ఉంటూంది. కథారచయితలకి వేరువేరుపేర్లే దొరకలేదా అనిపిస్తుంది. ప్రాచీన కథయైన కాంభోజరాజుకథలో కాంభోజరాజు పట్టపుదేవిపేరు మాణిక్యదేవి. బంగారు తిమ్మరాజు భార్యపేరు మాణిక్యాంబ. బాలనాగమ్మకథలో నవభోజరాజు రెండో భార్యపేరు మాణిక్యమ్మ.

## బోగం రంగసాని

బోగంది కొన్ని జంగం కథలలో ప్రాముఖ్యత వహిస్తూంది. కాని ఈ పాత్రల వర్తనలలో చాల భేదముంది. కాంభోజరాజుకథలో బోగం రంగసాని పేరుకి మాత్రమే బోగంది. ఆమె తక్కినవారి వలెనె బహుశీలవతి, విద్యావతి ఆమెను చెరబంది రాజు వివాహం చేసుకొంటాడు. బంగారు తిమ్మరాజుకథలోకూడ బోగంరంగసాని వస్తుంది. ఆమె విద్యలు నేర్చినదే కాని శీలం సున్న. బంగారు తిమ్మరాజు చావుకి ఆమే కారణమవుతుంది. బాలచంద్రుడి వేశ్యపేరు సబ్బాయి. మాయల ఫకీరుకి గవండ్లసంగమ్మ ఉంపుడుకత్తె. ఇదేకాదు ఈ కథలో బోగంరంగసానికూడ వస్తుంది. కుమారరామునికథలోని బోగందాని పేరు వేరు.

1710 ప్రాంతాలలో రచింపబడ్డ సర్వాయిపాపడి కథలో ఎరుకల నాంచారి ఈ పాత్రను వహించింది. లక్ష్మమ్మకథలో కథావీరుడు స్త్రీ లోలుడు.

## సమానచిల్లర పాత్రలు మొదలైనవి

జంగంకథలలో మరికొన్ని సమాన పాత్రలు కనబడతాయి. అడవిలోపోయే నల్లతంగాళ్ళకి గొల్లవారు బావిని చూపించేరు. అల్లే చిన్నమ్మ అడవిలోంచి వెళుతూండగా, దారి తప్పిపోయి గొల్లవారిని దారి చూపించమని కోరింది. కుమారరామునికథలో కుమారరాముడు బాలుణ్ణిచంపి ప్రశనాగులో పాతిపెట్టిన సంగతిని గొల్లలే బైటపెట్టేరు.

కాంభోజరాజుకథలో కుమ్మరిరాజు కుమార్తె కుసుమగంధిని చెరబందిరాజు వివాహం చేసుకొంటాడు. చిన్నమ్మకథలో చిన్నమ్మ అంత్ర కుమ్మరి ఇంటికివెళ్ళి పెద్దబాన కొంటుంది. కాని చిన్నమ్మ కుండకోసం వెళ్ళగా వాడు అమ్మడు. బంగారు తిమ్మరాజుకథలో భోగంది పచ్చికుండలు తెప్పించి నాట్యం చేస్తుంది. సన్యాసమ్మ కుమ్మరింటికివెళ్ళి పెద్దజాడీకొని తెస్తుంది.

మంత్రి బ్రహ్మయ కాంభోజరాజుకథలోను, బాలనాగమ్మకథలోనువస్తాడు. పల్నాటి వీరచరిత్రలో మంత్రికూడ బ్రహ్మయే (నాయుడు).

బాలనాగమ్మకథలో బాలవర్ధిరాజు ఇల్లువిడిచి వెళ్ళేముందు తులసిమొక్కను నాటి దాని బాగోగులు తనవిగా చూసుకోమ్మంటాడు. అల్లే కామమ్మకథలో మారయ్యకూడ తులసిమొక్కను నాటతాడు.

## మనుష్య పాత్రలలోని వైవిధ్యం

ప్రబంధాలలో అష్టాదశవర్ణ ముంటాయని మనం చెప్పుకొంటాం. జంగంకథలలో అట్టి వర్ణలుగాక కొన్ని సమాన లక్షణాలు కనబడతాయి, ఇవన్నీ కథాకల్పనకు సంబంధించినవి. కథావీరుడు లేక లేక జన్మిస్తాడు. అద్భుతమైనవాడుగా ఉంటాడు. దక్షిణనాయకుడుకావచ్చు. సముద్రయానతో దేశాటనో లేక రెండూనో చేస్తాడు. నాగేంద్రుడు వస్తాడు. నాగంభట్లు కొన్నిటిలో ఉంటాడు. మాణిక్యమ్మ, బ్రహ్మన్న, రంగసాని వస్తూంటారు. ఎవరో ఒకసాని తప్పదు. గొల్లలురావచ్చు. మునీశ్వరుడు తపస్సుచేసుకొంటూనో గురువుగానో వస్తాడు. వీటిలో దేవతలకి, మంత్రశక్తులకు స్థానముంటుంది. ప్రధాన పాత్రలు సాధారణంగా మరణించి, కావలిస్తే మళ్లీ బతికి స్వర్గలోకం చేరుకొంటారు. అయితే ఇక్కడ ఒక సంగతి చెప్పవలసుంది. ప్రతికథలోను రంగసాని అనుపేరు కనపడగా ఆ పాత్రయొక్క శీలం అన్ని కథలలోను ఒక్కమోస్తరుగానె ఉంటుందని భ్రమపడరాదు. ఎవరిశీలంవారిదే! పేరుమట్టుకే సమానం. అల్లే మాణిక్యమ్మ, నాగంభట్లు, తక్కిన పాత్రలున్న. శీలాలు వేరువేరుగా ఉన్నప్పుడు పాత్రలపేరు మాత్రం ఎందుకు వేరుగా ఉండరాదు అంటే అదొక బాహ్యలక్షణానుకరణం. ఒక సంప్రదాయంగా ఏర్పడింది.

## అద్భుతమైన గుర్రం

జానపదగేయాలలో అద్భుతమైన గుర్రాని కొక స్థానమేర్పడింది. దీనికి మూలం ఎంత ప్రాచీనమో పరిశోధిస్తేకాని తెలియదు. హిందూరాజుల అశ్వమేధయాగం కొంత కారణంకావచ్చు. పాశ్చాత్య వాఙ్మయంలో హోమరుకవి కావ్యాలలో కర్రతో చేయబడిన గుర్రమొకటుంది. దానిలో సైనికులు దాగుకొన్నారు కాంభోజరాజుకథలోని గుర్రం చిత్రమైన గుర్రం. ఇది విమానంలాగు ఆకాశంలో ఎగరగలదు. కీలుగుర్రం - అంటే మరలతో చెయ్యబడినది. ఇరవయో శతాబ్దంలో మరలతో తయారు చెయ్యబడిన మనిషి (రోబట్) మరలతో చెయ్యబడిన ఏనుగు సంగతి వార్తాపత్రికలలో చూస్తూంటాము. అల్లే కీలుగుర్రంకూడ యాంత్రికమే! క్రీ॥ శ॥ 1180 ప్రాంతందైన పల్నాటి వీరకథలో

ఒక విచిత్రాశ్వముంది. ఆ గంధర్వ గుర్రంమీద ఎక్కినవాళ్లు చస్తారు. అటువంటి గుర్రాన్ని పెద్దినాయుడెక్కి స్వాధీనం చేసుకొన్నాడు. కుమార రాముని కథలో దేవతాగుర్రం ఒకటుంది. గాంధారికథలోనుఉంది. దేశింగురాజుకథ (క్రీ॥ శ॥ 1723 ప్రాంతంది) లో బారాహజారి సుప్రసిద్ధం! ఒక ఫకీరు తపస్సుచేసుకొంటూండగా దేవతలు ఆ గుర్రాన్ని తెచ్చి ఇచ్చేరట! దానిని దేశింగు ఒక్కడే స్వారిచెయ్యగలిగేడు. ఇటువంటి గుర్రం ప్రజల మనస్సులో ఉండే అద్భుత గుణాన్ని చక్కగా తృప్తిపరుస్తూంది.

జంగంకథలోని గుర్రపుకథలన్నీ కవికల్పనాశక్తికి నిదర్శనాలనికొట్టి పారవెయ్యడానికిలేదు. 17-వ శతాబ్దంలోనిదైన ఈ క్రింది చారిత్రకాంశం 'ఆంధ్రవీర యువకులు * అను గ్రంథంలో తెలియజేయబడింది. దానిని రెండు మాటలలో తెలియజేస్తాను. క్రీ॥ శ॥ 1670 లో గోలకొండనవాబు నందిగామపరగణాకు వీరప్పనాయుని దేశముఖునిగా నిర్మించేడు. ఈ నాయనికి ముగ్గురు సంతానం. నాయుడు 1686-లో మరణించగా కుమార్లు ముగ్గురును పరగణాను తమలో తాము విభజించుకొన్నారు. కాని దానిని ఢిల్లీ పాదుసా ఛాయపరచాలి. కాబట్టి వీరు ముగ్గురూ, వీరిలో పెద్దతనికొడుకైన చిన్నపద్మనాభుడు కలిసి ఢిల్లీకి వెళ్ళేరు. పాదుసా చిన్న మెలతపెట్టి చిన్న పద్మనాభుణ్ణి తన దగ్గర ఉంచమనగా తక్కినవారు పాదుసానునమ్మి ఉంచేరు. అటువంటి సందర్భంలో చిన్నపద్మనాభుణ్ణి పాదుషాజనానాలోని ఒక స్త్రీ వలచిందని చెప్పవచ్చు. మొత్తంమీద పాదుషా అతన్ని తుదముట్టించదలచి ఒక పెంకి గుర్రాని అప్పగించేడు. ఆ వీరుడు ఆ గుర్రంమీద ఇరవైనాలుగు గంటల కాలం విడవకుండ స్వారిచేసేడు. చివరకి ఆ గుర్రం మరణించింది.

గుర్రపు స్వారిని గురించి 'ఆంధ్రవీరయువకుల' గ్రంథంలో మరొక చెప్పబడిన దానిని ఇక్కడ సంగ్రహపరుస్తాను. విజయరాఘవనాయకుడు ఒక గుఱ్ఱముపైనుండి మఱియొక గుర్రముపైకి లంఘించు నేర్పుగలిగియుండెను. కమ్మ, రెడ్డి, వెలమ మున్నగు కులములవారు అశ్వారోహణ విద్యయందు ఆశ్చర్య చారిత్రులైయుండిరి. వెలమలలో ఒక ప్రముఖుడు అశ్వరావుఅను బిరుదుగలవాడైనాడు. రెడ్లలో రాజమహేంద్రవరపు అల్లయరెడ్డినందనుడు దొడ్డయరెడ్డి గుర్రముతో దూకగల నేర్పు కాశీఖండ, శివలీలావిలాస కావ్యములలో కీర్తింపబడెను. అశ్వవిద్యానిపుణులను తెనుగువారు రేవంతులు, (అనగా అశ్వశిక్షకులు), రాహుత్తులు (అనగా గుర్రపు రౌతులు) అని వ్యవహరించిరి. అశ్వవిద్యలో పురాణ ప్రసిద్ధులు నలుడు, నకులుడు.

కాటమరాజుకథలో ఈ అద్భుతమైన గుర్రం స్థానాన్ని అద్భుతమైన బొల్లావు ఆక్రమించుకొంది.

---

* ఆంధ్రవీర యువకులు అను పుస్తకాన్ని ఆంధ్ర శేషగిరిరావుగారు 1952 లో ప్రకటించేరు.

---

"అయ్యర్! యీ కాఫీ ఏమిటి కిరసెన్ కంపు కొడుతున్నది"

"అయితే అది టీయై యుంటుంది! మా కాఫీ దిటర్పన్ లైనువాసన."

♦ ♦

"నాన్నా! డాక్టరుగారు నిన్ను చూడడానికి వచ్చారు"

"మానాన్నగారికి జ్వరము తగులుతున్నది - చూడడానికి వీలులేదని చెప్పు"

# స్త్రీల పాలిటి కల్పవృక్షం

శ్రీమతి పి. జె. శాంతమ్మ

ఓ! జగత్ ప్రఖ్యాతి గాంచినా
మా జనకా! కేసరీ! నరసింహస్వామీ!
మాయమయ్యావా!!
నీ వాక్కులే కరువాయెనా! -
నీ మోమే - మరుగాయెనా!!
ఇనమనమెల్లూరిలో - జన్మించినావు
లేమినే ఆస్తిగా తెచ్చుకొన్నావు.
ప్రాథమికవిద్యచట పూర్తిజేసావు
అమ్మతో మద్రాసు వచ్చియున్నావు.
ఉన్నత విద్యలు నేర్చుకొన్నావు
తెలుగుభాషలోటు తెలుసుకొన్నావు
ఆ లోటులుతీర్చ పూనుకొన్నావు
తెలుగుబాలలకొరకు త్యాగివయ్యావు
తెలుగుమందులతీపి తెలుసుకొన్నావు
గృహమునకు దీపిక - గృహిణియన్నావు
గృహిణి ఆనంద జీవితము వెతికేవు
'గొడ్రాలి' స్థానమే గ్రహియించినావు
శ్రద్ధతో 'లోధ్రను' కనిపెట్టినావు
కల్పవృక్షానిగా కనిపించినావు
గృహమునకు గృహిణియే లక్ష్మియన్నావు
గృహిణులకు ఒక మంచి 'పత్రికను' నీవు
"గృహలక్ష్మి"యను పేర స్థాపించినావు
స్త్రీ సమస్యలు తీరె దారి వెతికేవు
ఒచ్చింది ఉత్తేజం తెచ్చింది ధైర్యము
అణగారి యున్నట్టి ఆంధ్రకవయిత్రులు
తమజాతి మంచికై తరలివచ్చారు.
అత్తింటి 'కొత్తకోడలు' ఎటులమెలగాలో
తెలియవ్రాసింది ఒక తెలుగునారి

మగని 'ప్రేమను' ఎటుల పొందగలగాలో
తెలియవ్రాసింది ఒక తెలుగునారి
'వంటరాద'ని మగనిచేత తిట్టులుతినే
మగువకై 'పాకశాస్త్రము' వ్రాసెనొకతె.
'నెలతప్పియున్నట్టి' నెలతెటులమెలగాలో
తెలియవ్రాసింది ఒక తెలుగునారి.
'చంటిబిడ్డల' నెటుల పెంచుచుండాలో
తెలియవ్రాసింది ఒక తెలుగునారి
భర్తధూర్తుడుఅయితె భార్యెటులమెలగాలో
తెలియవ్రాసింది ఒక తెలుగునారి.
తన 'శీలమును' కాచుకొనుతీరు వ్రాసింది
తెలివైన ఒక తెలుగు సుగుణశీల
'తన ఇల్లు స్వర్గముగ' చేయాలి, అంటేను
'ఇటుల' నుండాలనివ్రాసె నొకతె.
ఉవిదలలోటులు ఎరిగిన ఉవిదలు
తెగువతో వ్రాసిరి తెలుగు వ్యాసాల్.
ఇంటింట "గృహలక్ష్మి" వెలుగుతున్నాది
కంటికి రెప్పలా కాచుతున్నాది.
మా తండ్రి! నీ మేలు మరచిపోలేము
జీవితాంతమువరకు నిన్నుదలచెదము.
నీ కలిమి, నీ బలిమి మాకొరకువాడి
ఓ బాబు కేసరీ! మమువీడినావు
నీ సుతల కీలోటు తీర్చువారెవరు?
నీ జ్యోతి మాలోన నిలుపుకొంటాము.
నీ బాటలోన మేం, నడుచుకొంటాము
'శాంతి' నీ యాత్మకు ఓ 'శాంతమూర్తి!'
కన్నీటి జోహార్లు అందుకో తండ్రీ!
జోహార్లు! జోహార్లు!! జోహార్లు!!!



# ఆరని జ్యోతి

శ్రీ సోమయాజుల సోమేశ్వరరావు.

పుట్టు ఫలములేని పురుషాధములు భువిని - బుట్టనేమిలేక గిట్టనేమి

పుట్టలోన చెదలు పుట్టదా ? గిట్టదా ? - విశ్వదాభిరామ వినుర వేమ.

ప్రపంచంలోని మానవులు తాము ఎందులకు జన్మిస్తున్నారో తాము ఎలా ప్రవర్తిస్తే జన్మసార్థకత కలుగుతుందో - యీ విషయాలను ఆలోచించరు. ఇలాంటివారు దినదినం పుట్టలో - జన్మించి పుట్టలో నశించే చెదపురుగులవంటివారే ! అందుచేత ఉత్తమోత్తమమైన మానవ జన్మను ఎత్తినందులకు ఫలం జన్మ సార్థకత చేసికోవడమే ! అంటే -

మానవ జన్మను ఎత్తినందులకు మంచికోసరమే బ్రతకాలి ! తానెక్కడ నివసించినా తాను ఎన్ని ప్రాణులకు ఎన్ని విధాల ఎంతకాలం ఉపకరింపగలడో - ఆ విధంగా ఉపకరించాలి ! అలాంటివాడే సత్పురుషశ్రేష్ఠుడు.

"Live for something - Do good, and leave behind you a monument of virtue that the storms of time can never destroy - write your name in kindness love and mercy on the hearts of thousands you come in contact with year by year, and you will never be forgotten - your name and your good deeds will shine as the stars of heaven."

"Chalmers"

"Do all the good you can, in all the ways you can, to all the souls you can, in every place you can, at all the times you can, with all the zeal you can, as long as ever you can."

" J. Wesley "

శ్రీ కోట నరకేసరిగారు పై ఆంగ్ల వాక్యాల్లోని ప్రతి అక్షరాన్ని ఆచరించి లోకానికి జూపిన సత్పురుష శ్రేష్ఠులు లేదా పై ఆంగ్ల వాక్యాల్లోని ప్రతి అక్షరం వీరి జీవితానికి అతికినట్లుందని చెప్పినా చెప్పవచ్చును.

శ్రీ వారు నేడు భౌతికంగా మన మధ్యలో లేనప్పటికీ ఆయన కీర్తికాయం ఆకల్పాంతంవరకు ఆరని జ్యోతిలాగు నిలిచి వుంటుంది; ఆయన స్మృతి మన మనస్సుల్లోనుంచి మాసిపోదు. మనలో ఆంధ్రరక్తం ఆంధ్రజాతీయత మాసిపోనంతవరకూ ఆయనకూడ మన మనస్సుల్లోంచి మాసిపోరు. ఆయన వృద్ధుడైనా ఆయన మనస్సు మాత్రం నిత్యయౌవనమే; ఆయన కీర్తిస్థిరమే; ఆయన సద్బుద్ధి సర్వదాస్మరణీయమే.

# అ మ ర జీ వి

శ్రీకన్నెకంటి వీరభద్రాచార్యులు

నిలు వెల్లంబుల కింపవెల్గెనుగదా
నీ పల్కు ముత్యాల శా
లలలోఁ గమ్మని మాతృదేవత నిజా
లంకారయై - పండు వె
న్నెలలై పోయెను కాఱుఁజీఁకటులు, తం
డ్రీ! కేసరీ! యుష్మదు
జ్జ్వల మేధా ప్రతిభా ప్రభాతతుల - లే
వా! నీవు లోకంబునన్

అణు మాత్రంబును సంశయింపక మహా
హ్లాదమ్ముతో - సోదరీ
మణులన్ గద్దెల నిల్పి పూజలిడి? ధ
ర్మ జ్యోతివై స్వర్ణ కం
కణముల్ గూర్చిన తెల్గు బిడ్డఁడవు, లో
కం బంతటన్ మేలి తో
రణముల్ జుట్టిన నీకు దీటెవరు? వీ
రగ్రామణీ! ధీమణీ!

3

అలుకుం జెందిన మాతృ లోకమున క
న్నా! కేసరీ! మేలు కొ
ల్పులు నీ పల్కులు తీయ తీయని తలం
పుల్ - భావి కళ్యాణ రే
ఖల చిత్రించి దివంబుఁ జేరితివి. దీ
క్షామూర్తి! నీ యానలో
జెలువుల్ గుల్కుచు వెల్గుగాత గృహాల
క్ష్మీ నవ్య సౌభాగ్యముల్

---

# సుభాషితాలు

గం. లక్ష్మీదేవి.

"నీవు జీవితాన్ని ప్రేమిస్తున్నావా? అయితే కాలాన్ని వృధాచేయకు—కాలమనే పదార్థంతో జీవితం సృజించబడింది."

"ఫ్రాంక్ విన్"

"ఎవరైనా స్వార్థత్యాగబుద్ధితో సత్యంకోసం సౌఖ్యంకోసం వీరోచితపనులు చేస్తే వాటిని మనం మరచిపోనంతకాలం అతడు మరణించడు."

"మాక్సింగోర్కీ"

"జాతులకు కూడా మానవులకు వలనే శైశవాద్యవస్థలున్నాయి"

"సెయింట్ జాన్ హెన్రీ"

"కరుణామయ హృదయం కనకకిరీటంకంటె గొప్పది"

"టెన్నిసన్"

"విమర్శకులు తమముందు ఏంజరుగుతోందీ గమనించేరు. ఏంజరగాలనుకుంటారో......దానికోసం చూస్తారు......"

—విశ్వకవి—

"కవులు గుర్తించబడని ప్రపంచాధినేతలు."

—షెల్లీ—

"ఎన్నడో జరుగబోవు సంగతులను మరీముందుగానే గ్రహించడం 'విజ్ఞాని' అనే నిత్యదోషియొక్క సహజస్వభావం."

"చార్లెస్ రీడ్"

తనకీ, ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా....కవిచేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వం"

"చలం"

"కవిహృదయం ఒక అద్దంవంటిది, ఆ అద్దంలో కనుపించే ప్రకృతియొక్క ప్రతిబింబమే కళ...అదేకవిత్వం."

"ఏమర్సన్"

---

## డాక్టర్ కే. యన్. కేసరి మృతికి సానుభూతి తీర్మానము

"కేసరిహైస్కూల్ వ్యవస్థాపకులగు శ్రీ డాక్టర్. కే. యన్. కేసరిగారు తే 8-6-53 దిన దివంగతులైనందుకు కేసరిహైస్కూల్ ఉపాధ్యాయబృందము, మరియు విద్యార్థి, విద్యార్థినులు తమ సంతాపమును తెలుపుచు, వారి ఆత్మకు శాంతి కలుగుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నారు."

# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

★

[స్వామినాథన్, మణి, శంకర్, శామ్యూల్‌లతో బాటు రాజంకూడ స్నేహితుడయ్యాడు. ముఖ్యంగా స్వామినాథన్‌కు రాజంయెడల ప్రత్యేకమైన ఆసక్తి ఏర్పడింది. ఒకనాడు స్వామినాథన్ రాజంగారి యింటికి వెళ్ళి, ఆతిధ్యం స్వీకరించి వచ్చిన నాడు అతనిని తన యింటికి పిలచి ఆతిధ్యమివ్వదలచి ఆహ్వానించాడు. తన యింటికి వచ్చిన రాజంను గౌరవించాడు. మణి స్వామినాథన్ నాయనమ్మకు పట్నముల లోని చిత్రవిచిత్రాలనుగురించి చెప్పాడు. మరునాడు స్వామి నాథన్ బడికిపోయి క్లాసులోకి పోగానే నల్లబల్లమీద 'తోక' అని వ్రాయబడి యుంది. అది ఎవరు వ్రాశారన్న విషయంగా వాదులాడుకోడం మొదలు పెట్టారు. వాదులాట గుద్దులాటగా మారగా బలవంతంగా హెడ్మాష్టరువచ్చి విడదీయవలసి వచ్చింది. పరీక్షకు తనకు కావలసిన వస్తువులు జాబితాను తయారుచేసి తండ్రికి చూపించాడు. స్వామి తాను కూడ పరీక్షకు కూర్చున్నాడు కాని చదివిన పాపానపోతేగా! బాగా వ్రాశామని చెప్పినవారిని చూచిమాత్రం అసూయపడేవాడు. పరీక్షలు ముగియగానే పాఠశాలను శలవులిస్తూ హెడ్మాష్టరు మూసివేస్తున్నట్లు ప్రకటించాడు — యిక చదువండి.]

(గతసంచిక తరువాయి)

## ౧౩

పది నిముషముల తదుపరి, 'ఆబూ' వీధిలోనున్న మణింటి దగ్గర స్వామి నిలుఁబడ్డాఁడు. రెండు మూఁడు దఫాలు స్వామి యీలవూదినా మణి బయటకురావటంలేదు. స్వామి మెల్లెక్కి తలుఁపు తట్ట సాఁగాఁడు; చివరకు - తలుఁపుగొళ్లెం ఆడించ సాఁగాఁడు.

ఎవరైనా మణికి బదులు వచ్చి, తలుఁపుఁదీసి ఎవరు నువ్వని ప్రశ్నించినట్లయితే - యేం సమాధానం చెప్పాలో తెలియక భయఁపడసాఁగాఁడు!

తలుఁపు తెరువఁబడింది; స్వామి గుండెలు తీవ్రతరంగా కొట్టుకో సాగింది. మణికి బదులు స్వామి భావించినట్లుగా యెవరో తలుఁపు తెరిచారు. అతన్ని చూస్తే, పెద్దవారు సహితం జడుస్తుంటారు. అబద్ధం

కాఁదు! యింతకీ అతన్నింత భయంకర మూర్తిగా తయారు చేసినవి; విశాలంగాను, గుబురుగానున్న కనుబొమలు, చీపురుకట్టల్లా వున్న మీసాలు మాత్రమే!!

— "ఎవరు నువ్వు?" ఆ భీకరమూర్తి భీకారాన్కి తగ్గట్టుగానే ప్రశ్నించాడు. ఆయనప్పట్టికీ స్వామి ధైర్యాన్ని మెచ్చుకోఁ దగ్గది!

"ఎవరు నువ్వు?" అని స్వామి అతణ్ణి తిరిఁగి ప్రశ్నించాఁడు!

"ఏమిఁటీ?... నా స్వంతయింటి దగ్గర, నున్న 'ఎవరు నువ్వ'ని ప్రశ్నిస్తున్నావా?... బలే!... ఊఁ!" అని ఒక్కమారు హుంకరించాఁడు!

అతన్నిగొంతునుండి యావిర్భవించిన ధ్వనికి నిజంగా భయఁపడి, వెనక్కయినా తిరిఁగి చూడకుండా తురఁగు పుచ్చుకొంటున్నాఁడు! యింతలో, వెనక నుండి. —

"యిక్కడిగో - యిలా రాబ్బాయ్!" అని, అతనే శాంత స్వరంతో పిలిచారు! స్వామి మాత్రం అతని యాహ్వానమును త్రోసి పుచ్చలేక, భయఁపడుతూనే పురోగమిస్తున్నాఁడు...

"ఎందుకట్లా పరిగెత్తుఁగుంటూ పారిపోతావ్? మణిని చూద్దామని వచ్చినపుఁడు, చూడకుండా పోతున్నావేమయ్యా?" అని, అతనన్నాడు!

"మరేం భయంలేదులెండి!" అని స్వామి తడఁబఁడుతూ అన్నాడు!

"లోనికి పోయి చూడబ్బాయ్!" అన్నారు. కదుఁటపడ్డ గుండెలతో స్వామి లోనప్రవేశించాఁడు...

తలుఁపువార నిలుఁబడియున్న మణిని స్వామితిలకించాఁడు! కొంతకాలంవరకు వారిరువురుమధ్యా నిశ్శబ్దం గడచిన తరువాత, వీధిలో నిలుఁబడిన వ్యక్తిని చూపిస్తూ, మెల్లని కంఠంతో. —

"ఎవరూ?" అని స్వామి మణిని ప్రశ్నించాఁడు. 'మామామ!,' అని మణి సమాధానం చెప్పాఁడు!! యింటి వాకిఁటి ముందర రెండు కుక్కలు దెబ్బలాడుకుంటూంటే, వాఁటిని తరిమే నిమిత్తము మణి మామ గుమ్మందిఁగి వాకిట్లోకి పోయిన సావకాశాన్ని జూచుకుని —

"మీ మామయ్యా? నాకు తెలియదే తెలీఁదు! అయితే నువ్విప్పుఁడు బయటకురావూ?... రావూ? నేనొక అత్యవుసర పనిమీఁద వచ్చాను. అర్జంటుగా. ఆరుకానులుంటే యివ్వు - నీ దగ్గర లేవూ? — ఆఁ బండివాఁడు' దూరదేశాలకు పోయాఁడంటే, వారాలు తరఁబడి మరిరాఁడు — మళ్ళీ యీ యువకాశం రమ్మంటే రాదయ్యా — వాఁడి దగ్గర చూచేందుకరదంగావున్న చిన్న 'గుర్రబండి' వుంది, అది నాకు కావాలయ్యా, అందుకు ఆరుకానులుంటే సరిపోతుంది; వేగిరం యివ్వు"

అన్ని స్వామి తొందర చేయ సాగాఁడు!

"నా దగ్గర డబ్బు లేదయ్యా, ఎవరునాకిస్తారు?" మణన్నాఁడు!

"మీ మామయ్య డబ్బునెక్కడ దాస్తావుంటాఁడు? ... ఒక మారు డబ్బులపెట్టెఁ జూడు! ..."

"నాకు తెలీఁదు! ..."

పై సమాధానముతో స్వామి హృదయాకాశములో నైరాశ్య శకలములావరింపసాగినవి!

"మణీ యీలా వోమారువచ్చి యీ కుక్కల్ని వెంట తరుము!" అని వీధిలోనుంచి మామయ్య పిలవటంచాత, మణి నిష్క్రమించాఁడు ... స్వామి చేయునదిలేక, నిరాశానిబిడీకృతమయిన హృదయముతో యింటి ముఖం పట్టాఁడు! ......

## ౧౪

"రాజం, నావెంటో పోలీసును పంపిస్తావా?" రెండు వారముల తరువాత, స్వామి రాజంతో అన్నాఁడు!

"పోలీసా? ఎందుకు" రాజం ప్రశ్నించాఁడు!

"యీ వూర్లో ఓ దొంగలంజాకొడుకు నన్ను మాపాఁడు!" అని కోపంగా స్వామన్నాఁడు!... 'బండివాడి' చరిత్రనంతా రాజంకు విశదపర్చిన మీఁదట. —

"ఆ తరువాత -" అని స్వామి బండివాడికీ తనకూ మధ్య జరిగిన తెగతెంపులు కాని ఓ కథ చెప్పేందుకుపక్రమించాఁడు!!

"...... నన్నుఁ జూచినప్పుఁడెల్లా - నన్ను మరవనట్లు నటించేవాఁడు, చూసేవా యీ గమ్మత్తు!... నేనెప్పుడైనా వాళ్ళింటికి వెళ్లినపుఁడు, తానింట్లో లేనట్లు, వుండీఁగూఁడా యెవరిచేతో కబురు పంపించేవాఁడు... నేనేమయినా, డబ్బుఁగాని, గుర్ర బండిఁగాని యిచ్చేయమని నిర్బంధించినట్లయితే కుక్క-చాత కరపిస్తానని భయపెట్టేవాఁడు...వాడ్ని యేం చేసినా పాపముంది రాజం?—" అని స్వామన్నాఁడు!

"వాడికో కుక్కవుందా?" రాజం ప్రశ్నించాఁడు!

"వున్నట్లుఁగూఁడా నేను చూడలేదయ్యా? లేకుండానే నన్ను జడిపించే నిమిత్తమట్లా అంటున్నాఁడేమో? యింతకీటక్కరి వెధవని మొదఁటేచెప్పానుగా!"

"అయితే వాఁడింట్లో జొరఁబడి, వాడ్నెందుకు తన్నలేకపోయావ్!...నువ్వేదో కొద్ది వెధవ్వి అని అనుకున్నానుఁగాని, వెర్రివెధవ్వి, జౌథావని అనుకోలే!"

"ఆ మాత్రం శక్తి సామర్థ్యాలుంటే, నిన్ను పోలీస్ను పంపమని బ్రతిమాలటం యెందుకూ అంటాని యింతకీ కబుర్లు యెన్నైనా చెప్పవచ్చు; కానీ — కార్యాలు చేయలేము!... యాతావాతా, చెప్పవచ్చేదేమిటంటే — వాఁడింట్లోకి వెళితే, నా మీదకు గుర్రాన్ని వుసికొలుఁపుతాఁడనుకున్నాను!" స్వామన్నాఁడు!

"పోనీ — నిన్ను తినకుండా వుంటేచాలు!" అక్కడే, రాజంతో సహా, స్వామి చెఁబుతూన్నదంతా వింటూన్న మణన్నాఁడు.

"కాఁదనుకుంటున్నావేమిఁటి? నువ్వు నాతో ఒక రోజు: టైలర్ 'రంగనాధం' దగ్గరకు వచ్చినట్లయితే, గుర్రాల్లోకూఁడా పులులకంటే విపరీతంగా అపాయాన్ని కలిగించే గుర్రాలుంటాయని నువ్వు వినఁగలవ్!" స్వామెంతో ఆశ్చర్యంగా చెప్పాడు!

"అయితే — ఏదో వొకరోజుచూఁచి, గేఁటు దగ్గర కాఁచి వాడ్ని పట్టుఁకో!" రాజం సలహా చెప్పాఁడు!

"ఆ ప్రయత్నంగూఁడా అయిందయ్యా! వాఁడెప్పుఁడూ బయటకు వచ్చినా కోతి కొమ్మెక్కి కూర్చున్నట్లు, బండి మీఁదేఁకూర్చుంటాఁడుఁగఁదా, వచ్చిన చిక్కాకు వాడితోని! నన్ను చూడగానే, గుర్రపు కళ్లెం సడలించి జోరుగా బండినితోలుకు పోతాఁడు! వెధవ!! ఇంతకీ నా రెండణాలకు పెద్ద తుపాను వచ్చింది!" స్వామి కంఠంతో అన్నాడు.

"ఆరు కానులు కదయ్యా!" రాజమన్నాఁడు!

"నాదగ్గర నుండి రెండు దఫాలు డబ్బులు తీసుకున్నాఁడు రాజం!"

"అవునయ్యా, ఒకణా, అర్ధణాకఁటూ?" రాజమన్నాడు!

"లేఁదురాజం; రెండణాలు!"

"పంద్రెండు దమ్మిడీలు ఒకణా అవదయ్యా? దఫాకు ఆరు దమ్మిడీలు చొప్పున మూఁడు దఫాలు యిచ్చావుఁగదయ్యా, మొత్తం అణన్నరపోటం లేదూ?" రాజం అన్నాఁడు. స్వామికి లెక్కలంటే యెంతో భయం; అదేం పాపమోఁగాని? అసలు లెక్కల్లో స్వామికి బుర్ర పరిగెత్తఁదు!

"యిదంతా అనవసరపు ప్రస్తాపన. ఎన్నిదమ్మిడీలు కలుస్తే ఓ అణా ఔతుందో యెవరికొక్కా-వలయ్యా?" స్వామిచిరాగ్గా అన్నాఁడు!

"డబ్బు విషయంలో మాత్రం నువ్వు జాగ్రత్తగా వుండాలి స్వామీ! సరే, నీకథ కానియ్ —" రాజమన్నాడు.

"వెండి నాణెములిస్తానని మొదట బండివాఁడు నా దగ్గర రెండుకానులు తీసుకున్నాఁడు; తరువాత మరి నాల్గు రోజులనాఁడు మరి రెండు కానులు అర్జంటుగా యివ్వమన్నాడు......మరి కొన్నాళ్లు పోయినతరువాత నన్ను వాఁడు చూడఁగానే పనంతా పూర్తికావచ్చింది, మరి రెండు కానులంటే యివ్వండి, లేకపోతే పనంతా చీదరగా చెడి వూరుకుంటుంది; మీ గురించే వస్తున్నాను యింతలో మీరే కనబడ్డారన్నాడు. నిజమేననుకుని నమ్మి యిచ్చేశాను. కొన్నాళ్లవరకు పని పూర్తికావచ్చింది, యింతవరకూ ఎలాగా సహనం వహించారు, కొద్దిలో వహించండని నన్ను బ్రతిమాలుకునేవాఁడు. మరి కొన్నాళ్లు పోయిన తరువాత పోయి అఁడుఁగుతే — నువ్వెవరవో నాకు తెలీదని తృళ్ళికసిరేవాఁడు! సరే, డబ్బు పోయిందని విచారించలేదు రాజం! నా కోపమల్లా, ఆ బండివాని కుర్రవానిమీఁద కేంద్రీకరించింది.

ఆ నల్లలంజా కొడుకున్నాడే, వాళ్ళనాన్నగురించి వాళ్ళింటికెళ్లినప్పుడెల్లా నన్ను చూచి కోతిలా వెక్కిరించేవాడు! లంజకొఁడుకు!! వాడ్ని నరికినా పాపముందీ? ... ఒకమారు నా వెనకనుండివచ్చి, బాల్చీతో నీళ్లు తెచ్చి నామీఁది వొంపేశాఁడు! యింతకీ నేను వొంటిగాణ్ణైపోయాను! వాణ్ణి తంతే, వాళ్లయ్య నా రెండణాలు యిచ్చేస్తాఁడు!!—"

## ౧౨

ఆ మరచఁటి రోజున బండివానింటికి — స్వామి, మణి బయలు దేరారు! రాజమే తొలినాఁడు చిన్న వుపాయమాలోచించి, యెలాగైనా సరే బండివాని కొడుకును ఎత్తుకవచ్చేయమని మణికి పురమాయించాఁడు! యీ విషయంలో స్వామికి మాత్రం చిన్న వాఁటూవుందనే చెప్పాలి. బండివాని యిల్లు మణికి చూపించటంతో స్వామి బాధ్యత తీరిపోతుంది; అలాఁగని , వెంటనే వచ్చేయడానికి వల్లకాఁదు!

స్వామినాథన్ యింటికి సర్గ్గా ఓ మైలు దూరంలో బండివాడు నివసిస్తూన్న గృహముంది! ఆ గృహమునకు కొలది దూరములో స్వామి, మణి వున్నారు. మణి బండివాని కొడుకు విషయంలో మణి తలపెట్టిన ప్రతీకారాన్ని వుపసంహరించుకుంటే బాఁగుండునని స్వామికి తోచింది!

"మణీ, ఆ బండివాని కొడుకు నా డబ్బు నాకిచ్చేస్తాఁడనుకుంటున్నాను"

"ఏమిఁటీ? ..."

"నేననుకుంటున్నాను......"

"నువ్వేమయినా అనుకుంటావులే! అవునుకదూ? సరే, నాకాయిల్లు చూపించు!" మణన్నాఁడు!

"వాణ్ణి విడిచిపెట్టేయ్‌మణీ! రాబోయే కష్టసుఖాలను నువ్వు వూహించకుండా, మొండిగా నువ్వు యీ పనిలోనికి దిఁగుతున్నావ్!"

"ఇఁదుగో. నువ్వు నోరు మూస్తావాలేదా? కిక్కు-రుమన్నావంటే - కోఁడి మెడలు నులిమేసినట్లు నీపీఁక నులిమేస్తాను; జాగ్రత్త హెచ్చరిఁక సాహో" అన్నాఁడు!

"వాఁడా మూడవ యింట్లో నివశిస్తూ వుంటాఁడు!" వేలుతో స్వామి, మణికి చూపించాఁడు!!

ఆఖరు క్షణంలో—యింతవరకూ చేద్దామని వూహించుకు వచ్చిన కార్యక్రమము నంతటినీ మణి మార్చివేసి, కొత్త కార్యక్రమము నూహించుకున్నాఁడు!! స్వామికి - బండివానియిల్లు సమీపిస్తున్నకొద్దీ, ఆందో

శన అధికమౌతూంది. స్వామి మాఱుమాటాడకుండ-రోడ్డుమధ్య కూర్చొఁబడిపోయాఁడు! బండివాని యిల్లు వచ్చేవరకు మణి స్వామిరెక్క పుచ్చుకుని, యీడ్చుకుపోయాఁడు!

ఇంటి ముందర నిలుఁబడి మణి యెవర్నో పిలువ సాగాఁడు!

“మణీ, మణీ! సంగతేమిటయ్యా?” అని ఆతృతను వ్యక్తపరుస్తూన్న గొంతుతో ప్రశ్నించాఁడు!

“ఒరేయ్, గాడిదా-” అంటూ మణి కొట్టఁబోయాఁడు.

స్వామి తీరుబడిగా గొంతెత్తి రాగాలాపన (ఏడ్పు) ప్రారంభించాడు. “ఊరుకో” పెట్టేందుకు మణి తన శాయశక్తులా ప్రయత్నించాఁడు! కాని స్వామి రాగాలాపనతీవ్రమై, తీవ్రతరమై తీవ్రతమమై ప్రతిధ్వనులను సృష్టింపసాగింది! ... వారిచుట్టూ ఆ వీధిలోని ఆడ, మగ విచక్షణ లేకుండా గుమికూడారు!

ఆ బండివాని గుడిసలోనుంచి బయటకువచ్చి, ఆ గుమికూడిన జనంముందర నోటిలో బొటనవ్రేలును పెట్టుగుని, పుట్టిన దగ్గరనుండి యీ క్షణంవరకూ సంస్కారమన్న దెలాగుంటుందో తెలియని కంపు కొడుతూన్న దేహముతో నిలుఁబడియున్న ‘బండివాని’ కొఁడుకును స్వామి మణికిఁ జూపించాఁడు!

గుమిఁగూడిన జనసమూహమును సంబోధిస్తూ, స్వామిని జూపించి.—

“మహాజనులారా! పెద్దమ్మలారా!! పెద్ద మనుషుల్లారా!!!

యీ కుఱ్ఱవాఁడెవడో (స్వామి) నాకు తెలీదు, కానీ, యితనికి రెండణాలు యివ్వాలని, యిస్తేగాని వీలులేదని నిర్బంధిస్తున్నాఁడు! యితన్ని నేనెప్పుడూ చూడనేలేదు! కానీ నేనా రెండణాలనూ చెల్లించకఁ తప్పదంటున్నాఁడు! -” అని మణి యిదే విధంగా పదిహేను నిముషములపాటు వుపన్యాసం చెప్పసాగాఁడు!

బండివానికొడుఁకు చివరకు నోట్లోంచి బొటనవ్రేలిని తీసివేసి—

“అణ్ణో, జైలుకు పంపండి!” అని మణికి సలహా చెప్పాఁడు.

యీ అవకాశమును పురస్కరించుఁకుని, మణి లేని నవ్వును పెదవులపైకిఁ దెచ్చుగుంటూ—

“వీణ్ణి పోలీసు స్టేషన్కు తీసుకుపోయే ప్రయత్నంలో నీ సహాయం నాకు లభ్యమౌతుందా?”

“ఉఁహూఁ!” అన్నాఁడు. పోలీసు స్టేషననగానే వాడొక్కమారు అదిరిపడ్డాఁడు!

“ఏమీ? ... అయితే-వీడెట్లా పోలీసుస్టేషన్కు వెళ్తాడనుకున్నావ్?” మణన్నాఁడు!

“నాకుఁదెల్సు?” అన్నాఁడు!

“అప్పుడప్పుడూ, వీడు నిన్ను బాధపెట్టేవాఁడా?”

“ఔ” దన్నాఁడు!

“మీ అయ్య నాదగ్గిర పుచ్చుఁగున్న రెండణా లేవయ్యా?” అని స్వామి వాడివయిపుఁదిరిఁగి యేడుఁపు ముఖంతో ప్రశ్నించాఁడు!

మణి అకస్మాత్తుగా.—

“నీకీ బొంగరం కావాలా?” అంటూ సూర్య తేజంలో ధళధళమని మెరుస్తూన్న బొంగరాన్ని చూపిస్తూ ప్రశ్నించాఁడు! ఆ కుఱ్ఱవాఁడు బొంగరం గురించి ముందుకు చేయిఁజాచాఁడు!

“నీకిప్పుడు యీ బొంగారాన్ని నేనివ్వను; నువ్వు నాతో వచ్చినట్లయితే, దీనికంటే పెద్దదిస్తాను. ఇఁక నుండి నువ్వూ, నేనూ స్నేహితులుగా వుందాం! ఏఁ? నీకంగీకారమేనా?” అని మణి ప్రశ్నించాఁడు.

"అయితే చూచేందుకోతూరి నాకివ్వరూ?" అని మణిని అడిగాడు. ఆ గొంతులో దీనత్వమెంతో వుట్టిపడుతూంది!

మణి బొంగరాన్నిచ్చాడు.

ఆ కుర్రవాడా బొంగరాన్ని చేత్తో రెండుమూడు దఫాలుతిప్పి, చూపుకైనా అందకుండా, కాలికి బుద్ధి చెప్పి, దూరానున్న సందులోకి అంతర్ధానమై పోయాడు!

ఈ పరిస్థితిని అర్థంచేసుగునేందుకు మణి చాలా కాలం తీసుగున్నాడు! యీ పరిస్థితిని అర్థం చేసుగున్న తరువాత, దూరానున్న సందులోని ఒక గుడిసెలోకి వాడు దూరిపోయినట్లు మణి గ్రహించి వెంటనే పరిగెత్తాడు!

మణి ఆ గుడిసెను చేరుకున్నాడు. వీధి తలుపు మాత్రం రుద్ధమైవుంది. మణి తలుపు తెరిచేవరకూ ఒక్కవూపున తట్టసాగాడు! చివరకు ఎవరో తలుపు తెరిచి ఆ కుర్రవాడింట్లో లేడని సమాధానం చెప్పి తలుపు మూసివేశాడు. అంతటితో మణి వెళ్ళిపోక, యింకా తలుపు బ్రద్దలయ్యేలా తట్ట సాగాడు!

ఆ చుట్టు ప్రక్కల నివశిస్తూన్న కొందరిళ్ళవాళ్లు మణి దగ్గరకొచ్చి, "నీవల్ల మాకు చాలా యిబ్బంది కలుగుతున్నాది; నువ్వింకా అల్లరికి పూనుకున్నట్ల యితే, నీమీద తగినచర్యలు తీసుగోదలిచాం, జాగ్రత్త!" అని హెచ్చరించారు! స్వామి మాత్రం పూర్తిగా భయపడిపోయి, పరిగెత్తమని ప్రోత్స హించాడు!

కానీ, మణికి పరిగెత్తిపారిపోవడం చాలా సిగ్గు చేటుగా వుండటంచాత, యింకా తలుపును బాదు తూనే వున్నాడు!

అక్కడిదివరకు మూగియున్న జనం రాళ్లు పుచ్చుగుని ఆ వీధిలో చల్లటిచెట్లు నీడల్లో నిద్రబోతూన్న కుక్కను లేపి, మణిమీదకుసీ గొల్పారు!

ఎప్పుడైతే కుక్కలరుచుగుంటూ మణిమీదకు కలియబడ్డాయో, "యిక లాభంలేదు పరిగెత్తు స్వామీ!" అంటూ పిక్కబలం చూపాడు.

రెండురాళ్ళు వెనకనుండివచ్చి, స్వామి వీపును సాఫీచేశాయ్, మరిరెండురాళ్ళు మణికి బుద్ధి చెప్పాయ్; జన్మలో - యింకా వీధికి రావలదని, వీరిద్దరకూ రోడ్డుతప్ప, మరే ప్రపంచమూ దృష్టికి గోచ రించుటలేదు!!

(సశేషము)

# — నిస్పృహత —

శ్రీ దొంతంశెట్టి రామమూర్తిగారు

(మే సంచిక తరువాయి)



జాతీయభోజ్యవస్తు వ్రాతంబును స్వచ్ఛమైనపాలు స్వగృహాసం
జాతములు సూక్ష్మమగునివి ప్రీతినివారెల్ల ననుభవించిన పిదపన్ ॥

ముదుసలితండ్రి లోకుఁడను పుత్త్రుఁడు నిర్వురు నగ్ని చెంతఁ జే
యుఁదగు పనుల్ పొనర్తురు గృహాంగనకై, బహుళా, ఘటించుటో
కమరునకున్ని, కీడ్పడినకత్తొ, లవిత్రమొ, కోలయో, మఱే
సదనముదో, పొలమ్మునదొ సాధనముల్ సరిచేయు చేనియున్ ॥

బెడగాసీలపు రోడ్డతాంచల మధ్యోవిస్తార దేశమ్మునగా
నడరన్, బూర్వవికార జానపదికంబౌ ధూమనాళమ్ము వెం
బడిలో కట్టున్నుండి, భాసురుచి వెన్నాబైన యుప్పాటనే
యిడనిల్లాలొకదీప మారకమునందెన్నంటనున్ వృద్ధమున్ ॥

సేవాతీత సమాన గేహ కరణా శేషమ్ము దీపమ్ము, సం
ఖ్యావిజ్ఞేయములైన గంటలకుఁదోడై సంజకెంతేని ముం
దై విస్తారమ్మగు రాత్రిదాఁక యుగపర్యాయంబునన్ వెల్ల నా
యావాసమ్మున; సాక్షియై జరులకాయుక్లేశ జీవాప్తికిన్ ॥

ఈ నియతినిఁ బ్రోత్సాహము నానందములేక, యాగతార్థాశయులై
మానకయాతురతను లో నూనిపనుల్ వారు చేయుచుండఁగ నంతన్ ॥

పదునెన్మిదవదియగునే డౌదవఁగ లోకునకునంత నొక్కనాఁడతఁడున్
ముదుసలియుం బ్రీతదీపము నెదుటన్ గూర్చుండియుండ నిల్లాలొకటన్ ॥

(ఉత్కథగీతికలాప నింబ్రబలునటుల దనయపూర్వ విధాన సంధ్యానమునను
నాప్రశాంత నిశాసమయమ్మునందు సందడించుఁ గుటీరమ్ముఁ జాలసేపు ॥

★

పరిసరముల విశ్రుతమయి పరులకును మితవ్యయమైక పరజీవనుతా
నిరువురు దంపతులచ్చట వరలుట సూచించు దీపభాస్వత్కాంతుల్ ॥

వితతసమావృతోన్నత భువిస్థితి, లోయఁ గుటీరమొక్కఁడౌ
కతన ; నిరంతరమ్మును, సకాలికమున్, బహుదూరదర్శిత
ద్యుతియుత దీపలక్ష్యమయియుంట, 'దివాంతపుఁజుక్క'యంచు వ్యా
హృతమగుఁ జిన్నపెద్దలగు నెల్లఱచేతఁ గుటీరమందునన్ ॥

అటులాగోపకుఁడన్ని వర్షములు జీవాలంబియై యాశఁగాం
చుటయున్నన్ దనపై నతెందు, దమిఁగాంచున్ దప్పకిల్లాలిపై
నెటులున్ వార్ధకమందుఁ బుట్టుటను బ్రత్యేకంబు వాత్సల్యమా
వటువై వృద్ధున కన్నిటన్ మఱియపూర్వంబంచుఁ జెప్పందగున్ ॥

సామాన్యంబుగ నెల్లతండ్రుల యసృగ్జాలంబునన్ మిశ్రమా
ప్రేమంబట్లు వివేకహీన సహజావేశమ్ముగా కైహిక
వ్యామోహమ్మునువీడు వృద్ధునకు భావ్యర్థ ప్రబోధాంచి తో
ద్దామోద్రేకముఁ గూర్చునట్టివరమే తత్పుత్రుఁడొక్కండెసూ ॥

ఆశలాంగతా లోచనా వేశములును గలఁచునావేగములు నై జగతి నశింప
వలయు నెడవాని పునరుద్భవంబుఁగూర్చు సుతసమైహికమెది ? వృద్ధపితరునకును ॥

హృదయమ్మున్ హృద్యమైక మోదమనఁగానే పారునీపాపఁడా
ముదికెంతేనియుఁ గూర్చునేలయన ; నీపుత్రుండుచేబిడ్డయా
నదనన్ వానికి నంగనోచిత సపర్యల్ చేసెఁ దానెన్నియే
సుదతీహస్తముతోడఁ బోలెనతఁడూచున్ బాలునుయ్యేలయున్ ॥

పితలకు నభ్యాసవిధిన్, గుతుకమునకు నుబుసుపోకకు
నుమాత్రమెగా, కతఁడుకుమాసహితాత్మో, దితసుకు
మారార్థ కృతులదీక్ష వహించెన్ ॥

(సశేషము)








## కందపచ్చడి

కందదుంప 5 పలములు తోలు విడిపించి సన్నగా ముక్కలుచేసి వుంచుకోనవలయును. $1\frac{1}{4}$ పలం ఎండుమిరపకాయలు, గచ్చకాయంత ఇంగువ, పెద్దచంచాడు ఆవాలు, చిటికెడు మెంతులు తీసివుంచవలెను. ఆ తర్వాత బాణలిలో $2\frac{1}{2}$ పలం మంచినూనెపోసి కాగిన తర్వాత ఇంగువను వేయించి తీసుకొని, వుంచుకొన్న ఎండుమిరపకాయలువేసి, నేరేడుపండుచాయగా వేగనిచ్చి ఆవాలు, మెంతులువేసి చిటపట అనగానేతీసి క్రిందపెట్టవలెను. చల్లపడిన తర్వాత మిరపకాయ తొడిమలు తీసి $\frac{1}{2}$ పలం చింతపండు, తగినంత వుప్పువేసి మెత్తగానూరి, వుంచుకొన్న పచ్చికందముక్కలు, తిరగపోతవగైరాలను వేసి, వక్కముక్కగా కలయనూరి, రాతి మరగలో తీసివుంచుకొని మళ్లా $\frac{1}{2}$ పలం మంచినూనె కాగనిచ్చి చంచా ఆవాలువేసి చిటపట అనగానే తీసివుంచుకొన్న పచ్చడిలో వేసి చంచాతో కలయబెట్టి తీసి వుపయోగించవలెను. ఇది చాలా రుచికరముగా వుండును. కొన్నిరోజులు నిల్వవుండును. ఇదేవిధముగ పచ్చిదోసకాయ, పచ్చి ఎఱ్ఱగడ్డలు, పచ్చిమిరపకాయలు, పచ్చిముల్లంగి, పచ్చి అరటిబొందె దంటు వగైరాలనుకూడా ఇదే మాదిరిగా చేసుకొనవచ్చును.

## మునగపువ్వుల పిండిమిరియం

మునగపూత $\frac{1}{2}$ పడి ఏరివుంచవలెను. 6 ఎండుమిరపకాయలు, 10 మిరియములు, కాస్త ఇంగువ, చంచాడు దనియాలు, పిడికెడు వుద్దిపప్పు, పిడికెడు శెనగపప్పు, ఒక చంచా నేతితో సువాసనవచ్చువరకు కలియ ఎఱ్ఱగావేయించి తీసి కాస్త పచ్చికొబ్బరచేర్చి మెత్తగా నూరి వుంచవలెను. ఆ తర్వాత ఒక అళాకు పెసలపప్పు మెత్తగా వుడికిన తర్వాత అందులో మునగ పువ్వులను వేసి, కాస్త చింతపులుసు, తగినంత వుప్పువేయవలెను. బాగా వుడికిన తర్వాత నూరి వుంచుకొన్న మసాలను కలిపి పోయవలెను. తర్వాత గరిటతో బాగా అడుగు అంటనట్లు కలియపెట్టి, 10 నిమిషములు వుడికిన తర్వాత తిరగపోతపెట్టి వుపయోగించవలెను. ఇదీ చాలా రుచికరముగా నుండును. ఇదేవిధముగ లేతగావుండే మునగ ఆకుతోకూడా చేయవచ్చును.

## మునగ ఆకుతో రాగిరొట్టెలు

$\frac{1}{4}$ పడి రాగిపిండి కొలిచి వుంచవలెను. పిడికెడు శెనగపప్పు నీళ్ళలో నాననిచ్చి రాగిపిండిలో వేయవలెను. మునగఆకు లేతది ఒకంత, పచ్చిమిరపకాయలు 10, ఎఱ్ఱగడ్డలు $2\frac{1}{2}$ పలం, సన్నగా తరిగి వుంచవలెను. $\frac{1}{2}$ పలం మంచినూనె కాగనిచ్చి $\frac{1}{2}$ చంచాడు ఆవాలువేసి చిటపట అనగానే చంచాడు వుద్దిపప్పువేసి వేగిన తర్వాత వుంచుకొన్న పిండిలో వేయవలెను. తర్వాత తగినంత వుప్పు పొడిచేసివేసి, తరిగి వుంచుకొన్న ఎఱ్ఱగడ్డవగైరాలను చేర్చి వీటితో పిండిని గట్టిగా కలిపి, ఆకుమీదనో, తెల్లని వస్త్రిముమీదనో, సన్నగా రొట్టెలు తట్టి, పెనముమీద వేసి, సన్నటి సెగతో కాల్చి తీసి వుపయోగించవలెను. ఇది తినుటకు చాలా బాగుండును. ఖర్చుతక్కువ.

ఎం. ఆర్. సీతమ్మ

# విండర్ మియర్ సతి విసనకర్ర

రచయిత :
ఆస్కార్ వైల్డ్

అనువాదం :
పో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

బె.రా:-రా, విండర్ మియర్ సతిగారి దగ్గర సెలవుతీసుకో. ఈ అవకాశం కలిగించినందుకు ఆమెకు నీ ధన్యవాదాల్ని అర్పించు. (మళ్ళా వెనక్కివచ్చి) మిస్టర్ హాప్పరుకి కార్డు పంపించినందుకు నేను చాలా కృతజ్ఞురాలిని. ఆయనెవరో తెలుసా. ఆస్ట్రేలియానుండి వచ్చేడు. ధనికుడు. ఇప్పుడు ఎవరు చూచినా అతన్ని గురించే మాట్లాడుతూ వుంటారు. అతని తండ్రి ఏదో ఒక విధమైన పిండిని డబ్బాల్లోకి ఎక్కించి ఆ అమ్మకంలో కావలసినంత డబ్బు సంపాదించేడు. ఆ పిండి తినడానికి రుచిగానే ఉంటుంది. అయినా మనవని వాళ్లు దానిని తినడానికి భయపడుతూ ఉంటారు. అయినా అతని కొడుకు మాత్రం నాజూకైనవాడు. అగాతా మాటల చమత్కారానికి అతడు ముగ్ధుడైపోతున్నాడు. ఆమె మనని విడిచిపెట్టి వెళ్ళిపోవడం మనకి కష్టమే. అయినా ఆడపిల్లలు ఎక్కువగాఉన్న ఇళ్లలో పెళ్ళిరోజులువచ్చే ఒకొక్క సారీ ఒకొక్క కూతుర్ని అత్తవారింటికి పంపనితల్లి తల్లి అనిపించుకోదు సుమా! రాత్రి తప్పకుండా వస్తాం. (పార్కర్ 'సి' తలుపులు తెరుస్తాడు) నేను చెప్పిన సంగతి మర్చిపోకండి. పాపం ఆయన్నెలాగైనా బైటి ఊరికి తక్షణం లాక్కుపోండి. అదే సరైన మార్గం. వస్తానమ్మా అగాతా! రా!

[బెర్రిక్ రాణి, అగాతాకుమారి - 'సి' గుండా నిష్క్రమిస్తారు.]

విం.స:-దారుణం! పెళ్లయ్యి రెండేళ్లుదాటని జంటని గురించిన ప్రస్తావన డార్లింగ్టన్ ప్రభువు ఇందాక ఎందుకు తెచ్చారో నాకిప్పుడర్థమయ్యింది. అబ్బా, నిజమైయుంటుందా - దానికోసమని ఆయన వేనకువేలు గుమ్మరిస్తున్నట్లుగాకూడా ఆవిడ చెప్పింది. ఆర్డర్ బ్యాంకుబుక్కుని ఎక్కడ పెడతారో నాకు తెలును - ఆ డెస్కులోని ఒక సొరుగులో. విషయం కనుక్కోవచ్చు, చూస్తానుగా. (సొరుగు తెరుస్తుంది) దారుణం, దారుణం! (లేచి 'సి' వైపు జరిగి) అబ్బే, ఏదో పొరపాటైయుంటుంది. ఆయన అటువంటిపని చేయరు. నన్ను ఎంతో ఇదిగా ప్రేమిస్తున్నారు. నేనెందుకు

చూడకూడదు? నేను ఆయన భార్యని, నాకు చూచేహక్కు ఉంది. బీరువా వైపుకి తిరిగివెళ్ళి పుస్తకంతీసి, ఒక్కొక్క పేజీ తణిఖీ చేస్తుంది, ముఖాన్ని చిరునవ్వు కనబడుతుంది. సందేహం నివృత్తికాగా ఒక నిట్టూర్పు విడుస్తుంది నాకు తెలుసు! పాపం లేనిపోని నీలాపనిందని ఆయనకి అంటగడుతున్నారు. (సొరుగులో పుస్తకాన్ని తిరిగి పెట్టేస్తుంది. అలాగ చేస్తూ, కంగారుపడి ఇంకో పుస్తకాన్ని తీస్తుంది) రెండో పుస్తకమూ - వ్యక్తిగతమైనది- తాళంకూడావేసి ఉన్నది! తెరవడానికి ప్రయత్నిస్తుంది. కాని లాభం లేకపోతుంది. బీరువామీద బాకుని చూస్తుంది. దానితో బైటకవరుని చింపుతుంది. మొదటి పేజీని చూడగానే కంగారుపడుతుంది- "మిసిస్ ఎర్లిన్ 600 పౌనులు - మిసిస్ ఎర్లిన్ 700 పౌనులు - మిసిస్ ఎర్లిన్ 400 పౌనులు. అయ్యో నిజమే! నిజమే! భరించలేను (పుస్తకాన్ని కింద విసరగొడుతుంది.)

[వింటర్ మియర్ ప్రభువు 'సి' గుండా ప్రవేశిస్తాడు]

విం.ప్ర:-ప్రాణప్రియా, విసనకర్ర వచ్చింది కదూ? ('ఆర్. సి' వైపు కదిలి పుస్తకాన్నిచూచి) మార్గరెట్, నాపుస్తకాన్ని చింపేవే. నీకు అలాటివని చెయ్యడానికి ఏవిధమైన హక్కు లేదే?

విం.స:-మీరు బైటపడినందుకు కంగారు పడుతున్నారు కాబోలు?

విం.ప్ర:-భార్య గూఢచారిలాగ భర్తని వెంబడించడం నాకు సుతరాం నచ్చదు.

విం.స:-నేను గూఢచారిలాగ ఏమీ ప్రవర్తించడంలేదు. అరగంట ముందటి వరకూ నాకీమనిషి సంగతి తెలియనే తెలియదు. నాపై కనికరించి ఒక వ్యక్తి లండనులో అందరికీ తెలిసిన ఈ విషయాన్ని గురించి - కర్జన్‌వీధికి మీరు రోజూ వెళ్లడమూ, మీ తీరని తృష్ణా, ఈ తప్పుడు ముండకని మీరు వేనకువేలు ఖర్చుపెట్టడమూ-చెప్పింది!

['ఎల్'ని దాటుతుంది]

విం.ప్ర:-మార్గరెట్! మిసిస్ ఎర్లిన్ గురించి నువ్వింత నీచంగా మాట్లాడడం ఎంత మాత్రమూ బాగులేదు.

విం.స:-(అతనివైపుతిరిగి) మిసెస్ ఎర్లిన్‌కి అప్రతిష్ఠరాకుండా ఉండాలని ఇంతశ్రమ పడుతున్నారుగదా. నాకు అప్రతిష్ఠ రాకుండా ఉండేట్లు చూడకూడదూ?

విం.ప్ర: మార్గరెట్, నీకు అప్రతిష్ఠ ఎంత మాత్రమూరాదు. నేనేదో ఎక్కడికో (పుస్తకాన్ని సొరుగులో పెడతాడు.)

విం.స:-అన్యాయంగా ఇంత డబ్బు ఇలాగ వ్యయపరుస్తూఉంటే ఎలాగ? మీరు డబ్బు ఖర్చుపెట్టే విధానాన్ని గురించి బాధపడుతున్నానుగాని, డబ్బు ఖర్చు అవుతున్నందుకుగాదు. మనడబ్బంతా వ్యయపర్చినా నాకేమీ కష్టంకలగదు. నన్ను ఇంతకాలము ఎంతో గాఢంగా ప్రేమించి, నాకు ప్రేమంటే ఏమిటో తెలియజేసి, ఎంతో హాయిగా కాలం గడుపుతూవచ్చిన మీరు డబ్బిచ్చి ప్రేమనికొన ప్రయత్నించడం చాలా శోచనీయం. అబ్బ, దారుణం! (సోఫా మీద కూలబడుతుంది.) ఇంతకీనాకే అప్రతిష్ట. మీకు చీమకుట్టినంతగా కూడాలేదు. నాగౌరవం మట్టిపాలయ్యింది! ఈ గడిచిన ఆరునెల్లూ సింహావలోకనంచేసిచూడగా నాకు ఎంత అసహ్యంగా తోస్తున్నాయో మీకు తెలుసా - మీరు నాకిచ్చిన ప్రతీముద్దూ అపవిత్రంగా నాకు తోస్తున్నది.

విం.ప్ర:-(ఆమెవైపు కదులుతూ) అలాగనకు మార్గరెట్ - నిన్ను తప్పించి ఈ విశాల ప్రపంచంలో ఇంకెవర్నీ నేను ప్రేమించలేదు.

విం.స:-(లేస్తూ) ఈ మనిషెవరు? దాని కోసమని మీరో ఇల్లు ఎందుకు అద్దెకు పుచ్చుకున్నారు?

విం.ప్ర:-నేను ఆమెకోసమని ఏ ఇల్లూ అద్దెకు తీసుకోలేదే?

విం.స:-అలాగ చేసేందుకు అనువుగా మీరు డబ్బిచ్చేరు. రెండూ ఒకటేగా?

విం.ప్ర:-మార్గరెట్, మిసెస్ ఎర్లిన్ నాకు తెలిసినంతవరకూ.

విం.స:-ఎర్లిన్ అనే అతను ఉన్నాడా లేకపోతే పట్టి కట్టుకథేనా?

విం.ప్ర:-ఆమె భర్త చనిపోయి ఎన్నో సంవత్సరాలయ్యింది. ఆమె ఒంటరికత్తె.

విం.స:-బంధువు లెవరూ లేరూ. (ఆగి)

విం.ప్ర:-ఎవరూ లేరు

విం.స:-విషయం ఏదో వింతగానే ఉన్నట్లుంది.

['ఎల్' దగ్గర ఉంటుంది]

విం.ప్ర:-(ఎల్. సి. దగ్గర) నేను చెప్పే విషయం శ్రద్ధతో విను. నాకు తెలిసినంతవరకూ మిసెస్ ఎర్లిన్ ప్రవర్తనలో ఏవిధమైన దోషమూ లేదు. ఏదో కొన్ని ఏళ్లకుముందు.

విం.స:-(ఎల్. సి. దాటుతూ) దాని జీవిత వివరాలేమీ నాకక్కరలేదు!

విం.ప్ర:-నేను ఆమె జీవిత వివరాల్ని గురించి చెప్పదల్చుకోలేదు. ఈ విషయం మాత్రం చెబుతున్నాను - ఒకానొక

కాలంలో మిసెస్ ఎర్లిన్ మీలాగే హాయిదాని అనుభవించింది, ప్రేమించబడ్డది, గౌరవింపబడ్డదికూడా. ఆమె ఉన్నత కుటుంబంలో జన్మించినా ఆమె సమస్తమూ కోలుపోయింది. పరిత్యజించింది అంటే బాగుంటుందేమో కూడా. అది చాలా బాధాకరమైన విషయం. ఇక్కట్లు సంభవించవచ్చు, అవి బయటినుండి వస్తాయి, ఒక్కొక్కసారి హఠాత్తుగాకూడా రావచ్చు. అయినా తానుచేసిన పొరపాట్లకు ఒక వ్యక్తి నానా అవస్థలకీలోను కావలసియుండడం ఎంతో దుర్భరమైన విషయం. ఇది ఇరవై యేళ్లకుముందు జరిగిన సంఘటన. అప్పుడామె బొత్తిగా పసితనంలో ఉండేది. నీ విప్పటివరకూ నాతో ఎంతకాలం కాపరంచేసేవో అంతకంటె తక్కువకాలమే ఆమె కాపరం చేసింది.

విం.సః-నాకు దానిజోలి అనవసరం, మీరు దానినీ నన్నుకలిపి మాట్లాడడం నేనెంతమాత్రమూ సహించను. దానిని గురించి మాట్లాడడమే సభ్యంకాదు.

[డెస్కుదగ్గిర కూర్చుంటుంది]

విం.ప్రః-తలుచుకుంటే నీవీస్త్రీని ఇట్లే కాపాడగలవు మార్గరెట్. ఆమె ఎప్పటిలాగే మళ్ళా సంఘంలో తిరగడానికి ఉబలాటపడుతుంది, అందుకామె నీ సహాయాన్ని అర్థిస్తున్నది.

[ఆమెవైపు వెడతాడు]

విం.సః-నా సహాయమా!

విం.ప్రః-అవును, నీ సహాయమే.

విం.సః-దానికెంత సాహసం!

విం.ప్రః-మార్గరెట్, నిన్నో సహాయం కోరదలిచేవచ్చేను. ఆమెకు నేను చాలా డబ్బు ఇచ్చిన సంగతి కనిపెట్టే నేవు నేను దానిని ఎంత దాచదలచినప్పటికీ. అయినప్పటికీ ఈ సహాయాన్ని నేను నిన్ను మళ్ళా అర్థిస్తున్నాను. మన రాత్రి విందుకి రావలసినదిగా ఆమెకో ఆహ్వానాన్ని పంపించవలసినదిగా నేను నిన్ను కోరుతున్నాను.

విం.సః-మీకు పిచ్చెత్తినట్లున్నది.

[లేస్తూ]

విం.ప్రః-నేను నిన్ను బతిమాలుతున్నాను. ఆమె సంగతి ఎవరికీ సరిగ్గా తెలియకపోయినా లోకులామెను గురించి పలు విధాలుగా మాట్లాడవచ్చు. ఆమె ఎన్నో ఇళ్లకు వెళ్లింది, అయితే అవి నువ్వు వెళ్లేఇళ్లు కాకపోవచ్చు, అయినా గౌరవనీయులైన స్త్రీలు వెళ్లేదగ్గ ఇళ్లే. అంత మాత్రముచేత ఆమె తృప్తిచెందలేదు. ఆమె నీదగ్గిరకి అథవా ఒకసారైనా రాదలచినది.

విం.సః-ఏం ఇక్కడికి వచ్చినామీద విజయం సాధిద్దామనా?

విం.ప్ర:- కాదు ; ఆమెకు నువ్వు చాలా మంచి దానివని తెలుసు. ఇక్కడికి ఒకసారివచ్చి వెళ్లిందంటే ఇంక ఏప్రదేశానికి వెళ్లడానికి అడ్డంకి ఉండదని ఆమె అనుకుంటుంది. నీ సంగతి తెలుసుకునే ఉద్దేశంతో ఆమె ఇక్కడికి రాదలచడంలేదు. నువ్వా మాత్రం సహాయం ఆమెకు చెయ్యలేవా?

విం.స:- ఊహుం! నిజంగా పశ్చాత్తాపపడిన స్త్రీ, తాను పతనంచెందిన సంఘంలో తిరిగి తలెత్తుకుని తిరగడానికి ఎంత మాత్రమూ ప్రయత్నించదు.

విం.ప్ర:- నేను బ్రతిమాలుతున్నాను.

విం.స:- ('ఆర్' తలుపువైపుకి వెళుతూ) విందుకు ముస్తాబు కాదలిచేను, సాయంత్రంలోపుగా మళ్ళా ఆ ఊసు ఎత్తకండి. ఆర్థర్ ('సి' వైపున్న అతనివైపువెళ్ళి) నాకు తల్లిదండ్రులు లేనందువల్ల ఒంటరిదాని ననుకుని నన్ను మీయిష్టం వచ్చినట్లు ఆడించదలిచినట్లున్నారు. పొరపాటు, నాకు చాలామంది మిత్రులున్నారనే సంగతి మర్చిపోకండి.

విం.ప్ర:- (టేబిల్ దగ్గిరే ఉండి) మార్గరెట్, నీ వాగుడు నాకేమీ అర్థంకావడంలేదు. నేను నీతో వాదించదలచలేను. మిసిస్ ఎర్లిన్‌ని నీవు పిలవాలని నేను, నొక్కి చెబుతున్నాను.

విం.స:- (బీరువాదగ్గిర నిలబడి) నేను ఆ పనిని ఎంత మాత్రమూ చెయ్యను. (టేబిల్‌ని దాటుతూ.)

విం.ప్ర:- అయితే నువ్వు నన్ను ధిక్కరిస్తున్నావా? ('సి' దగ్గిర నిలబడి.)

విం.స:- ముమ్మాటికీ.

విం.ప్ర:- అబ్బా, మార్గరెట్ నాకోసమన్నా దీనిని చెయ్యి, ఈ తరుణంపోతే ఆమె జీవితం అంధకార బంధురమై పోతుంది.

విం.స:- నాకూ దానికీ సంబంధమేమిటి?

విం.ప్ర:- ఆదర్శ గృహిణుల అంతరంగం ఎంత కఠినమైనది!

విం.స: స్త్రీలోలత్వం పురుషుల్ని ఎలాగ లొంగదీసుకుంటుంది!

విం.ప్ర:- మార్గరెట్, మాలో ఎవడూ కూడా తాను పెళ్లాడే స్త్రీ కంటె ఎక్కువ సుగుణవంతుడు కాకపోవచ్చు ననే విషయం నేను ఒప్పుకున్నా - నేను మాత్రం అటువంటిపని చేస్తానని-అబ్బా, అలాగనుకోవడమే దుర్భరంగాఉంది!

విం.స:- మీరు తక్కిన పురుషులలాగేకదా ఉంటారు. లండనులోఉన్న ప్రతీ పురుషుడూ ఏదో ఒక వ్యసనానికి లోనైయుంటాడని నేను విన్నాను.

విం.ప్ర:- నేను అటువంటివాణ్ణికాదు.

విం.స:-అలాగని నేనెలాగ నమ్మగలను?

విం.ప్ర:-నీ హృదయాన్ని నేనెరుగుదును, నువ్వు నమ్ముతున్నట్లుగా అది తెలుపు తుంది. మనిద్దరికీ మధ్య అగాధాల్ని సృష్టించకు. ఈ కొద్ది నిమిషాలలో మనకు మనస్పర్థకలిగింది. కూర్చుని ఆ కార్డునిరాయి.

విం.స:-నా కంఠంలో ప్రాణం ఉన్నంత వరకూ ఆ పనిని ఎంత మాత్రమూ చెయ్యను.

విం.ప్ర:-(బీరువావైపు వెళుతూ) అలాగైతే నేనే రాస్తా! (ఎలక్ట్రిక్ బెల్ కొడుతూ, కూర్చుని కార్డు రాస్తాడు.)

విం.స:-అలాగైతే దానిని ఇక్కడికి రప్పిస్తా రన్నమాట? (అతనివైపు కదులుతూ)

విం.ప్ర:-అవును.

[నిశ్శబ్దం పార్కర్ ప్రవేశం]

పార్కర్!

పార్కర్: అయ్యా, సెలవు (డెస్కువైపు వస్తాడు) ఈ ఉత్తరం మిసెస్ ఎర్లిన్ గారికి పంపించు 84. ఏ. కర్జన్‌వీధి. జవాబుకి వేచియుండవలసిన అవసరం లేదు.

[పార్కర్‌కి ఉత్తరాన్ని అందిస్తాడు]

పార్కర్ 'సి' ద్వారా వెళ్లిపోతాడు.

విం.స:-ఆర్థర్, అదిగాని ఇక్కడికి వచ్చిం దంటే, దానిని తప్పకుండా అవమా నిస్తా.

విం.ప్ర:-మార్గరెట్, అలాగనకు.

విం.స:-నేను అలాగే చేసితీర్తాను.

విం.ప్ర:-ఇదిగో అమ్మాయి, నువ్వుగాని ఆ పని చేసేవంటే లండనులోఉన్న ప్రతీ స్త్రీ నీ పట్ల చిరాకు చెందుతుంది.

విం.స:-సత్ప్రవర్తనగల ప్రతీ ఆడదీ నేను అలాగ చేసినందుకు నన్ను తప్పకుండా శ్లాఘిస్తుంది. మేము కనికరించి విసిగి పెట్టేస్తున్నాం. కాస్త కఠినంగా ఉంటేనేకాని లాభంలేదు. ఈ రాత్రి నేను కొత్త పంథాన్ని తొక్కితే, (విసనకర్రనితీస్తూ) మీరు నాకీ విసన కర్రని ఇచ్చేరు. ఇది నా పుట్టినరోజు పండుగనాడు మీరిచ్చిన బహుమతి. అదిగాని నా గుమ్మాన్ని దాటివచ్చిం దంటే, దాని ముఖంమీద ఈ విసన కర్రతో ఒక దరువు వేస్తాను.

(సశేషము)



# దయ్యం

"ఘనమూర్తి"

"ఛీ, ముండా, ఛీ! ఇంక నాకంటికి కనబడ్డావంటేచూడు నిన్ను ఏంచేస్తానో, మొహాన ఇంత పేడరాసి మరీపంపిస్తా. ఒరేవు! మాధవా! ఇలారా, చూడరా యీ ముండ నన్ను ఎలాగున అల్లరిపెడుతూందో" అంటూ వంట ఇంటిలోనుండి కేకలు పెడుతూంది గోపమ్మ.

గదిలో పేపరు చూస్తూఉన్న మాధవశాస్త్రి కేక వినబడగానే గాబరాగావచ్చి "ఏమిటమ్మా ఆ కేకలు, ఎవరు వచ్చేరు ఏమిటి" అని అడిగేడు. "ఎవరంటావేమిటిరా? అదే నీ పెళ్ళాం కాంతమ్మ." "అత్తా సాయం వస్తారూ" అంట్లూ నా చేయిపట్టుకొని లాగుతుందిరా అంది" గోపమ్మ.

"అదేమిటమ్మా అలాగంటావు. అది చనిపోయి మూడునెలలైంది అది ఎలాగు రమ్మంటుందే, ఆ మహాసాధ్వి చచ్చి ఏ స్వర్గాన ఉందో దాన్ని తిట్టకే పాపం కూడానూ" అని ఒక్క నిట్టూర్పు విడచేడు.

"నీ తెలివి ఏడిసినట్టేఉంది, చచ్చిన ముండ చావక నన్ను పీక్కొని తింటూంది" అంది గోపమ్మ.

"కానిస్తూ, వేగంగా పనిచేసుకొని గదిలో కొచ్చేయి" అంటూ వెళ్లిపోయేడు శాస్త్రి. కాంతమ్మ గర్భంతో చనిపోయింది. ఆమె బ్రతికినన్నాళ్లు హాయిగా కాలక్షేపంచేసి చనిపోయింది. అంతమందిలో మంచి అనిపించుకొని పసుపు కుంకుమతో లేచిపోయింది. గోపమ్మ కాంతమ్మను బ్రతికినన్నాళ్లు కాల్చుకొని తినేది. అందుచేతనే దయ్యంఅయి పీక్కొని తింటూంది.

గోపమ్మ అంటూ ఎంగిళ్లు ముగించుకొని గదిలోనికొచ్చి చాపగుడ్డపరచుకొని దానిమీద కూర్చుంది. "ఒరే! మాధవా! దీని కేదేనా పని చేయాలి, లేకుంటే నన్ను చంపేస్తుంది."

"ఊరుకో అమ్మా! దయ్యం ఏమిటి, నీ భయంగాని, అదేంచేస్తుంది. అసలు దయ్యమంటూ ఉందాయని నా అనుమానం" అన్నాడుశాస్త్రి.

"బాగుండరా? లేకపోవడం ఏమిటి, దెయ్యం ఎలాగు ఉంటుందో చెప్ప మన్నావా. వికృతంగా ముఖం, చింపిరి జుత్తు, పాదాలు వెనక్కి తిరిగి ఉంటాయి, పెద్దగోళ్లు, పారపళ్ళు, దాన్ని చూస్తేనే భయం వేస్తుంది. దయ్యాలలో అనేక రకాలు ఉన్నాయిలే. మనపెరట్లో చింత చెట్టుమీద కామినీ దయ్యంఉంది. అది మనశారదకూతురు, పెళ్లి కాకుండా 18 సం॥ చనిపోయింది. అది కామినీ భూతం అయింది. రాత్రివేళ బావా వస్తావా ఆడు కుందాం. బావా! వస్తావా ఆడుకుందాం అంటుంది. పడుచుమగాళ్లపై బడి అల్లరి చేస్తుంది. అది ఎంత చక్కగా ముస్తాబై కనపడతుందనుకున్నావు. అదీ వాలుజడ, మల్లెచెండు చూడు చూడనిపిస్తుంది. మన ఏటివడ్డునఉన్న దిబ్బమట్టిమీద నిప్పు దయ్యంఉంది. ఎప్పుడూ నిప్పులురాలుస్తూ ఉంటుంది. దడుసుకున్నారంటె వెంటనే వాంతులు, విరోచనాలు పట్టుకొని చస్తారు. కొన్ని దయ్యాలు మనుష్యులతో కాపురం చేస్తాయి. పేరమ్మకోడలు దయ్యమై, రామిగాడితో కాపురంచేయలేక. చక్కని పిల్లల్నికని ఎక్కడికోపోయింది. కొన్ని దయ్యాలు మనుష్యులనే ఎత్తుకొని పోతాయి. మీ తాతని రాత్రికి రాత్రి ఎత్తుకొనిపోయి ఏటివడ్డున పడేశాయి. వెంకటరత్నాన్ని మంచంతో ఎత్తుకొనిపోయి వారధికానాలో పండుకోపెట్టేయి. తురక దయ్యం మాచెడ్డది. అది పడితే ఒక అంతటికీవదలదు. దానికి దెబ్బలేమందు" అంది గోపమ్మ.

''చాల్లెద్దు ఊరుకోవే! వెధవ దయ్యాలు గొడవ'' అంటూ శాస్త్రి పండుకున్నాడు.

గోపమ్మ చాపమీద పంచ తలక్రింద పెట్టుకొని "మనోజవం మారుతతుల్య వేగం" అంటూ శ్లోకం చదివి పండు కుంది.

మాధవశాస్త్రి ధైర్యమైన మాటలు చెప్పేడేగాని లోపల మాత్రం చిమకు, చిమకులాడుతోంది. తన స్నేహితుడి భార్యకిలాగే ఒక దయ్యంపట్టి నానాగడ్డి తినిపిస్తోంది. ఏటివడ్డున దయ్యాలు ఉండడం నిజమేకాబోలు. ఆ మట్టి దగ్గర నిప్పు రాల్పడం నిజమే, అక్కడక్కడ నిప్పుకన బడడం నిజమే, నేను ఎవరో చుట్టకాలుస్తు న్నారు అనుకొనేవాడిని. తెల్లార గట్ట దొడ్డికిపోతే ఉస్సు, రస్సుమంటూ కేకలు వినిపిస్తాయి.

నిజంగా దయ్యాలే కాబోలు బట్టలు ఉతుకుతాయి. యీలాగు తలపోస్తూ కూర్చున్నాడు. అప్పటికి ఒంటిగంట అయింది. మాధవశాస్త్రికి నిద్రపట్టలేదు. దెయ్యాలను కంటికి కట్టినట్లు కనబడు తున్నాయి. కిటికీ తలుపులు మూసేసేడు. ఇంతలో పెరటితలుపు ఎవరో కొడు

తున్నారు. వంట ఇంటిలో పెద్దచప్పుడు. అన్నికలసి శాస్త్రిని కంగారు పెట్టేశాయి. క్రిందను పండుకున్న తల్లిని లేపేడు గజ గజా వణకిపోతున్నాడు.

గోపమ్మలేచి "ఏంరా! నాయనా! ఏమిటి అలాగున్నావు" అని అడిగింది.

"శాస్త్రి గాద్గదికంగా దయ్యమే వంట ఇంటిలో అల్లరిపెడుతూంది, పెరటితలుపు గుద్దుతోంది" అన్నాడు.

"ఫరవాలేదు అదే వెళుతుంది ఈశ్వర ధ్యానంచేసి పండుకో" అంది.

మాధవశాస్త్రి ఈశ్వర ధ్యానంచేసి పండుకున్నాడు.

మాధవశాస్త్రికి ఆఫీసులేదు, ఆనాడాది వారం చాల తీరికగాఉంది, ఉదయాన్నే స్నానంచేసి కాఫీ త్రాగి "డెపల్ హోమ్" అనే నవల చదువుతున్నాడు. మంచి రస వత్తర ఘట్టంలో "వదినా, వదినా" అంటూ ప్రక్క ఇంటి రంగమ్మ ఇంట్లోకి వచ్చింది.

మాధవశాస్త్రి పుస్తకంమడచి టేబిల్ మీదఉంచి "ఏమత్తా యిలా గొచ్చావు అమ్మ ఏటికెళ్లింది వస్తుంది ఉండు" అన్నాడు.

"ఒరే! శాస్త్రి మాపద్మ యీ వేళ రాత్రి బండిలో మదరాసునుండి వస్తూంది, మీమామగారు పొలంపనిమీద గ్రామాంతరం వెళ్ళేరు, రేపుగాని తిరిగిరారు. నీవు స్టేషన్‌కివెళ్లి పద్మను తీసుకొనిరావాలి" అంది రంగమ్మ.

"ఓ తప్పకుండా రాత్రివెళ్లి తీసుకొని వస్తా" అన్నాడు శాస్త్రి.

ఇంతలో గోపమ్మ బిందెనీళ్లు ఇంట్లో పడేసి "ఏం వదినా ఇలాగొచ్చేవు" అంది.

"హాం! ఏమీలేదు రాత్రిబండిలో పద్మ వస్తుంది. మీ అన్నగారు గ్రామాంతరం వెళ్ళేరు, మాధవశాస్త్రిని స్టేషనుకి వెళ్లి పద్మను తీసుకొని రమ్మన్నాను" అంది.

"ఆ మాత్రం దానికే, తప్పక వెళ్లు తాడు. ఒరే మాధవా వెళతావుకదూ" అని అడిగింది.

"వెళతానమ్మా" అన్నాడు శాస్త్రి.

"వెళ్లివస్తానమ్మా ఇంకా పండుకోవాలి" అంది రంగమ్మ.

"వెళుదువుగానిలే, అన్నగారులేరుగా కాస్సేపు కూర్చో" అంటూ పీటవేసింది.

రంగమ్మ పీటమీద కూర్చుంది, గోపమ్మ కాఫీపెట్టి రంగమ్మ కింత ఇచ్చి తాను ఇంత త్రాగింది.

"వదినా చూచేవా కాంతమ్మ దయ్యం అయి నన్ను పేపుకొని తింటూంది దానికి నేను ఏంచేసేనే" అంది గోపమ్మ.

"ఊరుకో వదినా నీ పిచ్చిగాని దెయ్యం లేదూ, దేవతా లేదు ఊరుకో" అంది రంగమ్మ.

"పోనీగాని దానిసంగతి కేంగాని నీవు పద్మను మా శాస్త్రిగాడికిచ్చేయికూడదూ. ఇద్దరూ చిలకా గోరువంకల్లాగ ఉంటారు. ఇద్దరూ చదువుకున్న వాళ్లు" అంది గోపమ్మ.

"నేనేం కాదన్నానా మీ అన్నగారిని అడుగు తథాస్తు అనదాం" అంది రంగమ్మ.

"సరే వస్తుందిగా దానినే అడిగేస్తాను" అంది గోపమ్మ.

రంగమ్మలేచి "వస్తావొదినా ఇంకా వండుకోవాలి. ఓరే శాస్త్రీ మరచిపోకు" అంటూ వెళ్లిపోయింది.

రాత్రి 8 గంటలైంది మాధవశాస్త్రి మంచంమీద పండుకొన్నాడు. గోపమ్మ అంటూ ఎంగిళ్లు చేస్తోంది. మళ్ళా గోపమ్మ తిడుతోంది కోడలు కాంతమ్మని. శాస్త్రి మెల్లగా లేచి "అమ్మా! ఎందుకే తిడతావు రేపు ఏదేనా చేయిద్దాం. వేగం గదిలో కొచ్చేయి" అంటూ వెళ్లిపోయేడు.

గోపమ్మ గదిలో చాపవేసుకొని "ఒరే! మాధవా మన పెరటి చెట్టుమీదఉన్న కామినీ భూతానికి నీ పెళ్ళాం కాంతమ్మని భేతాళరాజుచేత భూస్థాపితం చేయించాలి" అంటూ పండుకొంది.

రాత్రి పదిగంటలైంది ఆకాశం మేఘావృతంగాఉంది. మాధవశాస్త్రి ఒక్కడు పోవడానికి భయం, ఎవరూ సాయంలేరు. ఇంతలో వర్షం ప్రారంభమైంది, ఆలాగు ఆలోచిస్తూ మంచంమీద నిద్రపోయేడు. గోపమ్మ గురకలుకొడుతూ చాపమీద పండుకొంది. గదిలో బెడ్ లైటు వెలుగుతూంది. ఇంతలో "అత్తా! అత్తా" అంటూ పిలుస్తూంది పద్మ.

గోపమ్మలేచి నాలుగువైపులాచూచి పండుకుంది. మళ్ళా పిలుపువినిపించింది. గోపమ్మకి పట్టరానికోపం వచ్చింది "ఒసే! ముండా పెరటిలోంచిపోయి వీధిపట్టేవు. ఏమిసాహసమే, ఉండు చస్తే చచ్చేను నిన్ను పట్టుకొని గదిలోపెట్టి నిసిగ కొయ్యకపోతే నేను గోపమ్మనుకాను' అంటూ గబగబా వీధితాళంతీసి తలుపు తీసింది. గుడ్డివెన్నెలలో పద్మ నిలబడింది. గోపమ్మ కామినీ భూతం అనుకొని పద్మకొప్పు పట్టుకొని బరబరా యీడ్చి ఎంత చెప్పినా వినక కొట్టులోపడేసి తాళంవేసింది.

"చావుముండాచావు. యీ రోజుతో నీ పీడ వదులుతూంది, వాడిని లేపి ఇప్పుడే నిసిగ కోసేస్తా" అంటూ గదలోకి వెళ్లింది.

మాధవశాస్త్రి మైమరచి పండుకున్నాడు. గోపమ్మ "ఓరే! మాధవా లేరా ఆముండ దొరికింది! గదిలోపెట్టి తాళంవేశాను" అంటూ తట్టిలేపింది.

శాస్త్రి కళ్లు నులుపుకొని గది నాలుగు వైపులా చూచేడు ఎదురుగా తల్లి కన పడింది "ఏమమ్మా ఇలా గొచ్చేవు అంటూ వాచీచూచేడు. రెండుగంటలైంది అమ్మా! స్టేషనుకి వెళ్లలేదు, పద్మని తీసుకొనిరాలేదు అత్త ఏమంటుందో. ఇంతకీ పద్మ వచ్చిందోలేదో వెధవనిద్ర తెలివే రాలేదు''అన్నాడు.

లోపలనుండి పెద్ద గొంతుకతో"అత్తా! తలుపుతీయత్తా నేను దయ్యాన్నికాను, పద్మను బావా! చూడు బావా అత్త ఎలాగు చేసిందో. తలుపుతియ్యి బావా రా అంటూ అరుస్తూంది పద్మ.

మాధవశాస్త్రి "ఏమిటమ్మా ఆ కేకలు ఎవరున్నారు గదిలో" అని అడిగేడు.

"అదేరా అదే ఆ చెట్టుమీాదఉన్న కామినీ దయ్యం. అదీ, ఆముల్లెచెంబు, ఎంత చక్కగా వచ్చిందనుకున్నావు ధైర్యం చేసి కొట్టులో పడేశాను కత్తిర పట్టుకొనిరా; సిగ కత్తిరిద్దాం" అంది గోపమ్మ.

ఇంతలో గదిలోఉన్న సామానంతా చిందర వందర చేస్తూంది పద్మ కోపంతో. ఆఖరికి తలుపు తియ్యకపోతే ఏడుపు మొదలు పెట్టింది.

"చూశావా! ఎలా గల్లర పెడు తోందో, ఏడుస్తుంది వెధవ ఏడుపే. ఆ భేతాళరాజుని పిలవరా యీా ముండని భూస్థాపితం చేయిద్దాం" అంది.

ఇంతలో రంగమ్మ లాంతరుతోవచ్చి వీధి తలుపు గుద్దుతోంది "వదినా, వదినా తలుపు, తలుపు" అంటూ పిలుస్తోంది.

మాధవశాస్త్రి గబగబాపోయి తలుపు తీసేడు. రంగమ్మ లోనికివచ్చి "ఒరే! శాస్త్రి వచ్చిందిరా పద్మ! వెధవది నాది మొద్దునిద్దర. అందులో వెనకగదిలో పడక, పాపం పిలచేరు కాబోలు నాకు విన పడలేదు'' అంటూ చెబుతోంది.

గదిలోనుండి పద్మ ''అమ్మా! తలుపు తియ్యవే ఇదిగో యీా గదిలో అత్త నన్ను దయ్యం అని పడేసింది. బావా! తలుపు తియ్యవూ'' అంటూ ఏడుస్తూంది.

"ఏమిటి వదినా ఆ గదిలో ఏడుపు ఎవరున్నారు ఏమిటి" అంది రంగమ్మ.

"ఎవరా అదే మనచెట్టుమీాదఉన్న కామినీ భూతం" అంది గోపమ్మ.

"లేవే కామినిభూతం ఏమిటి, కొంపతీసి పద్మ కాదుకదా అమ్మా! అని పిలుస్తోంది'' అంటూ గబగబావెళ్లి తలుపు తీసింది. ఒక్కమారుగా పద్మవచ్చి తల్లిని కౌగలించుకుంది.

"ఇదేమిటమ్మా ఇది. ఎవరు నిన్ను గదిలో పెట్టారు, బావస్టేషనుకిరాలేదు" అని అడిగింది.

పద్మని చూడగానే మాధవశాస్త్రి తల దించేసుకొన్నాడు, గోపమ్మ నిర్ఘాంత పోయింది, పద్మ జరిగిన సంగతంతా తల్లితో చెప్పింది.

మాధవశాస్త్రి పద్మ చేయి పట్టుకొని క్షమించమన్నాడు. "తాను స్టేషనుకి రాక పోవడానికి అమ్మ కారణం" అన్నాడు. "దయ్యాలగోలతో మనస్సు కలతపెట్టే సింది, భయంలేనివాడికికూడా భయం తెచ్చి పెట్టింది. ఆఖరికి నిన్ను యీలాగు చేసింది క్షమించు" అన్నాడు.

"పోనీలే బావా! తెలియక జరిగిన విషయం దానికి మనం ఏంచేస్తాం, ఇప్పు డైనా వప్పుకున్నావా అత్తా నేను దయ్యాన్నికానని, బావా! వస్తాను అత్తా జాగ్రత్తగా వండుకో. దయ్యం అని బావను మూసేయగలవు" అంటూ వెళ్లింది.

"మూసేస్తానే భడవా! నిన్నూ, బావనికలిపి మూసేస్తాను" అని నవ్వుతూ అంది గోపమ్మ.



# కీ॥ శే॥ డా॥ కే॥ యన్॥ కేసరిగారి ప్రశంస

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

కేసరిగారు లోకబాంధవులు. మనకు మిగుల సన్నిహితులు. వారి జీవిత మహిమను వీక్షించు అవకాశములు మనకు లభించినవి. చాల కాలమునుండి వారి నెఱుగుదును. వారెన్నడైన పరుషవాక్కును ప్రయోగించుట నేనెఱుగను. పరమ ప్రశాంత భావముతో వారు ప్రసంగించువారు. వారి హృదయము కారుణ్యజలనిధి. జగతి ఎఱుగని గుప్తదానముల నెన్నిటినో వారు నిర్వహించిరి. మదరాసులోని తెలుగు వారి పురోభివృద్ధికై ముందంజవేసిన మహాపురుషుడాయన. కేసరి ఉన్నత పాఠశాల, కేసరి కన్యా విద్యాలయము, కేసరి కుటీరములు మహోన్నతములైనవి. నేడు మదరాసు మనకు లేకపోయినను పూర్వోక్త సంస్థలు కేసరిగారొనరించినవి; వారి జీవాత్మ ప్రసా దించు ఆశీస్సులనందుచు, క్రమాభివృద్ధినందునని ఆశపడుచున్నాను. వారి "గృహలక్ష్మి" ప్రతి గృహలక్ష్మి గృహమును ప్రతిజ్ఞానువు గృహమును అలంకరించుచునేయుండును. స్వర్ణకంకణ బహూకృతి జరుగుచునే యుండును. నేడాంధ్రభారతి విలపించుచున్నది. వారి పవిత్రాత్మకు అనంతానందము ఈశ్వరుడు ప్రసాదించుగాక.

# నవ్వు పువ్వులు

ప్రథమ చికిత్సా విధానపు పరీక్షలో ఒకమ్మాయిని "మూర్ఛావస్థలోనున్నవానికి ప్రథమ చికిత్స ఎలాగ చేస్తావు" అడిగారు.

"బ్రాందీని పానీయంగా యిస్తాను"

"బ్రాందీ సమయానికి లేకపోతే?"

"తెప్పించి యిస్తానని చెప్తాను"

♦ ♦ ♦

కొద్దిగా సిగ్గుపడుతున్న యువకుడు అందమైన యువతిని "నీకు వివాహమయిందా" అని అడిగాడు.

కొంటెతనంగా "లేదు" అంటూ తల యూపుతూ "నేను తెలివితక్కువ దానినిగా ఎవరి చేతుల్లో చిక్కలేదుయింకా" అన్నది.

"ఓహో! అలాగా!" ఉత్సాహంతో "అయితే నాచేతుల్లో చిక్కతావన్నమాట" అన్నాడు.

♦ ♦ ♦

ఒక చెట్టుక్రింద నిలబడియున్న గ్రామస్థుణ్ణిచూచి మోటారు ప్రయాణీకుడు "ఏమయ్యో! మీయిల్లు తగులబడిపోతున్నది" అని చెప్పాడు.

గ్రామస్థుడు కదలకుండా "నాకు తెలుసు" అన్నాడు.

"మతిపోయిందాఏమి! తగలబడిపోతున్న యిల్లును చల్లార్చుకోడానికి ప్రయత్నించవేమిటి" అని ఆశ్చర్యంతో అడిగాడు.

"నేను చేస్తున్నదదే. ఇల్లు తగలబడటం ప్రారంభించినప్పటినుండి వర్షం కురవాలని భగవంతుని ప్రార్థిస్తూ నిలబడియున్నాను" అన్నాడు.





**RITA**
**HAIR TONIC**






బి. సుశీలగారు

ఏలకో యీ వ్యధలో నావాసం ?
ఎందుకో యీ వృధాయాసం ?
ఆగిపోయిన హృదయ తంత్రుల
రాగమెరుగని రాగబాధలు
వీణతంత్రుల వ్రేళ్లు కదలక
ఆలపింపక నిలిచెనేమో !
ప్రియుని పిలుపుల కాగెనేమో !!
వలపుకలలను గాంచెనేమో
ఎంతసేపో వింతచూపుల
చింతబాయని వంతలోబడి
ఊహాకందని లోకమెరుగని
సాహసమ్ము రమత జేరిచి
కదలకుండిన హృదయ తంత్రుల
కంపమొందుచు పలుకుచున్నది
ప్రేమగొలిపే ప్రియునిపిలుపా ?

భ్రాంతిగొలిపే గాలిపాటా ?
పాడవే ఓ వీణ ప్రణయస్వరాలు
మరచిపోనీయకే మధురస్వప్నాలు
మధువునింపకు నన్ను నేమరచిపోనీయకు
శిథిల హృదయములోన చేదునిండిన వేళ
విరజాజి విడువక వేడినిట్టూర్పులను
భరియింపలేనా బ్రతుకుభారములేదు
పిలువకేకీరమా పయినింపకేనన్ను
తెలుపలేనిగాధ ప్రేమికుల కిపుడు
పారిజాతమ నీ ప్రక్క దాచవేనన్ను
బాటసారులకెపుడు భ్రమకలుగకుండ
మరణమా నీవు పరిహసింపగలేవు
ప్రణయరాణిని నేనె ప్రళయగామిని నేనే !






# దాహహరమునకు చికిత్సలు

కొత్తిమీరాకు సాధారణంగా మనం వంటకాలలో వాడుటకలదు. బహుముఖంగా వైద్యోపయోగము కూడాను. వట్టియాకును నమలిన దాహము నణచి ఆకలిపుట్టించును.

ఖర్జూరపు కాయలలోని విత్తనములను తీసి పారవేసి కషాయముగా చేసికొని సేవించినచో దాహమును తపనను అణచును.

ముదురు చింతచిగురును ఎండబెట్టిన దానిని చింతపొట్టు అనెదరు. ఇది చాల పత్యకారి. కాబట్టే మనయిండ్లలో పత్యమునకు వంటకములలో వాడెదరు. చింతపొట్టు పొడి చిన్న ఉల్లిపాయలేసి నూరినది విశేషంగా అన్నహితవుగా నుండును. చింతపొట్టు చారు దప్పిననుచును.

వసకొమ్మును కొద్దిగా కాల్చి నోటిలోనుంచుకొని నమలి మ్రింగుచుండిన నోట నీరూరును. నాలుకకు ద్రవముకలుగును. దాహము నణచును.

పెద్దగుమ్మడికాయ పండినది దాహము నణచును. కూరగాను, పులుసుగాను అన్నసాధకంగా మనము వాడుచుండుటకలదు.

పెద్దబచ్చలి ఆకు పప్పుకూర కూరకూడ దప్పినణచును.

పానకము మనము సర్వసాధారణముగా శ్రీరామనవమి మొదలగు పర్వదినాలలో తయారుచేసి సేవిస్తుంటాము. ఇది నయితం దప్పి నారుస్తుంది.

లేతకొబ్బరికాయ నీరు దాహోపశమనానికి మేలుచేస్తుంది.

# తో డు దొం గ లు

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

సుజాత సుతరాం వప్పుకోలేదు. నారాయణ నాకు వద్దంటె నాకు వద్దని కూర్చున్నాడు.

'పురిటిగదిలోనే మూడుముళ్లువేసే మహాపురుషులుమీరు. నా అదృష్టంకొద్దీ, యీ వయస్సొచ్చేంతవరకైనా ఆగారు. లేకపోతే యెప్పుడో మెడకు కట్టేసివుంటే నా జీవితాంతం మీ జీవానపడి యేడవాలసి వచ్చేది' అంటూ చీదరించుకున్నాడు నారాయణ.

'మేనత్తకు వకకొడుకుండగానే మొగుడయి కూర్చుంటాడేమిటి నాకు అర్థంకాక అడుగుతాను. మీదంతా చాదస్తంకాని ఆ రోజుకు యెవరో వకరు వస్తార్లే' అంటూ సుజాత నిష్పచీగానొక్కి వక్కాణించింది.

సుజాత తల్లి, యెట్లాజరగాలసివుంటే అట్లాగే జరుగుతుందిలే అని, నారాయణ తల్లి రాసిపెట్టుంటే తప్పుతుందా అని యిద్దరు అద్వైతంలోకిదిగి కూర్చున్నారు.

"ఈ యింటివాణ్ణి చెయ్యటంతోనే వచ్చింది కొంపకు అనర్థకం. 'తాదూర సందులేదుకాని మెడకోడోలు' అన్నాడట! అట్లావుంది మీ పద్ధతి. 'నేను యిప్పుడప్పుడే పెళ్లిచేసుకోనని చెప్పలా యెన్ని సార్లు' అంటూ కసురుకున్నాడు నారాయణ.

'ఈ చదువు సంగతేమిటో తేల్చుకునే దాక, నాకా వివాహ విషయం చెప్పకండి. మెత్తనివాళ్లనుచూస్తే వత్తబుద్ధవతుందని, వూరుకుంటుంటే, మహారెచ్చిపోతున్నారు' అంటూ నిష్కర్షగా చెప్పేసింది సుజాత.

వీళ్లిద్దరు యింత నిష్పచీగా నిర్భయంగా చెప్పేస్తుంటే తల్లి తండ్రులు మాత్రం యేం చేస్తారు!

'ఇది చివరిసారి చెప్పటం. నేను యిప్పుడప్పుడే పెళ్లిచేసుకోను' తల్లినోటివెంబడి మాట సాంతం వినకమునుపే 'అదే చెపుతున్నాగా ఇంకా అయిదేళ్లదాక' ఇక నువ్వేమనుకున్నా సరే' అన్నది సుజాత తల్లితో అతిధైర్యంగా.

'కన్నకొడుకు కష్టపెట్టాడంటే లాభం లేదు. నువ్వూ ఆలోచించాలి. ఈ వివాహ విషయంలోమాత్రం యెవ్వరి జోక్యం నేను సహించను. తర్వాత యెవరెట్లా అనుకున్నా సరే' అన్నాడు నారాయణ కనుబొమ్మలు ముడేస్తూ.

'ఆడింది ఆట పాడిందిపాటగావుంది దానిపని. అదంతా తండ్రిచనువే. అయిదేళ్ల తర్వాత చేసుకుంటుందిట' అన్నది సుజాత తల్లి, వదినగారితో అతి వుక్రోషంగా.

'మా నారాయణ అసలు ఆ మాట అంటేనే మండిపడుతున్నాడు. తన మంచికి చెప్పినా తెలుసుకోకపోతే యెవరేమి చేస్తారు. పెట్టుకున్నకొద్దీ బాధే తప్ప యింకేం లేదు' అంది నారాయణ తల్లి సమాధానంగా.

ఇక ఆ ప్రస్తావనే రావటంలేదు యిళ్లల్లో. వక నెల గడిచిందేమో అంతే.

'అమ్మా! ఎందుకే నామీద అంత కోపం, ఎట్లాగో వుంటున్నావు' అన్నది సుజాత తల్లి దగ్గరకు వస్తూ.

'కూతురిమీద కోపం వుంటుందేమిటే యే తల్లికైనా నువ్వు కాబట్టి నిప్పేచీగా చెప్పేశావు కాని' అన్నది సుజాత తల్లి.

సుజాత ముసిముసి నవ్వులు నవ్వు కుంటూ 'ఎందుకొచ్చిన గొడవే యిదంతా. అంతా నీ యిష్టము' అంటూ గబగబ గది లోకి వెళ్లిపోయింది.

'అమ్మా! నేను అదివరకు యేమన్నానో అన్నాను. నీ యిష్ట ప్రకారమే కాని. ఇంతకీ పెళ్ళిచేసుకోమంటావు అంతేగా' అన్నాడు నారాయణ తలవంచేసుకుని.

'అంతకంటె నే న న మ న్నా ను రా నాయనా' అంది నారాయణ తల్లి పట్ట రాని సంతోషంతో.

'ఏవమ్మోయి వదినా, మా అబ్బాయికి యేంబుద్ధి పుట్టిందో వాడు వప్పుకున్నా డమ్మా' అన్నది నారాయణ తల్లి.

'సరే నేనూ - ఆ శుభవార్త చెప్ప టానికే ప్రయాణమయ్యాను. నాలుగు రోజులనుంచి యింట్లో ఆదో విధంగా వుంటూ వచ్చింది. అసలు విషయం కాస్తా నిన్న బయట పెట్టేసింది. ఇక వియ్యాపు రాళ్లమమ్మోయి' అన్నది సుజాత తల్లి.

ముసిముసి నవ్వులు యిద్దరి ముఖాల మీద నాట్యమాడినాయి.

'ఏమిటే హడావిడి ... నిన్నే...మాట్లా డవే' ...

'పూరుకోవమ్మా మధ్య నీ గొడవొకటి అంతా మోసం ... దగా ... పైగా పెళ్లికి రమ్మని శుభలేఖకూడా .... సిగ్గుం డాలి .... ఎంత మగవాడైనా ... '

'ఏమిటే అమ్మాయి నాతో చెప్పవే...'

'ఏమిటి చెప్పేది ... ఈ మహేంద్రున్నే నేను పెళ్లి .... '

'ఏమిటీ మహేంద్రున్నే పెళ్లి చేసు కుంటానని చెప్పింది, అదా విషయం. ఇంత మార్పు యెట్లా వచ్చిందా అని అప్పుడే అనుకున్నానుసుమా! నేను యింకా బాషను చేసుకోవటానికే వప్పుకున్నావనుకున్నా .... ' అన్నది సుజాత తల్లి ముక్కుమీద వేలు వేసుకుని.

'ఆ.... బావను చేసుకోవాల్సిందే! .... వకమగవాణ్ని యెంతమంది చేసుకుంటారేమిటి?'

'ఏమిటే ఆ మాటలు ...

'ఏమిట్రా హడావడి ... నిన్నే .... మాట్లాడవే'

'వూరుకోవమ్మా మధ్య నీ గొడవ వొకటి ... అంతా మోసం ... దగా.... పైగా పెళ్లికి రమ్మని శుభలేఖకూడా ... సిగ్గుండాలి ... అందులో ఆడజన్మ ...

'ఏమిట్రా అబ్బాయి నాతో చెప్పరా ... '

'ఏమిటి చెప్పేది .... ఈ మాలతినే నేను పెళ్లి .... '

'ఏమిటీ మాలతినా పెళ్లిచేసుకుంటానని చెప్పింది. అదా విషయం. ఇంతమార్పు యెట్లా వచ్చిందా అని అప్పుడే అనుకున్నా సుమా!

నేను యింకా సుజాతను చేసుకోవటానికే వప్పుకున్నావనుకున్నా..' అన్నది నారాయణతల్లి, ముక్కుమీద వేలు వేసుకుని.

'ఆ...సుజాతను చేసుకోవాల్సిందే! ... వక ఆడదాన్ని యెంతమంది చేసుకుంటారేమిటి?'

'ఏమిట్రా ఆ మాటలు ...'

'చూశావా వదిన. తెల్లవన్నీ పాలని నమ్మేవాళ్లం. మనకు యీ గొడవ అంతా యేం తెలుసు! వప్పుకుందంటే నిజమే అనుకున్నా. తీరా నిలవతీస్తే, మహేంద్రున్నిట! మహేంద్రుడు .... అవుతే నాకు తెలీక అడుగుతాను. మీ అబ్బాయికి సంబంధం అదివరకే కుదుర్చుకున్నారా యేమిటి' అన్నది సుజాత తల్లి, కొంచెం జంకుతూనే.

'చాల్లే వదిన నీ భాష్యంమాటలు. అమ్మాయికి సంబంధం కుదుర్చుకుని నా దగ్గరకు రాకపోతే, యిష్టంలేదని చెపితే యెవరు కొట్టారు. ఏదో గంతకుతగ్గ బొంత అని, మావాడికి తగ్గది మావాడికి దొరక్కపోతుందా! ఈనాటకం అంతా యెందుకంట! పైగా మా వాడికి సొద్దులు చెతుకుతున్నావు యెదురు?' అన్నది నారాయణ తల్లి, ముఖం చిట్లించుకుంటూ

ఏమిటమ్మా నువ్వనేది నాకేమి తెలియ పట్టటంలేదే' అన్నది సుజాతతల్లి పూర్తిగా అమాయకంగా.

సుజాత చిటచిటలాడిపోతోంది. నారాయణ మటమటలాడిపోతున్నాడు. సుజాత కోరచూపులతో చకచక నడిచింది పెళ్లి పందిర్లోకి. నారాయణ ఓరచూపులతో పొంకి పొంకి వస్తున్నాడు. వధూవరుల్ని చూసేటప్పటికి యిద్దరు గభాలున వులిక్కిపడ్డారు.

'బావా! నువ్వా! ...' అన్నది అతి ఆశ్చర్యంగా కళ్లు పెద్దవిచేస్తూ సుజాత.

'ఆ ... నేనే! .... మహేంద్రున్ని పెళ్లియింది చూశావ్గా. ఏమంటావు?' అన్నాడు నారాయణ చిరునవ్వు పెదిమల మీదికి రానిస్తూ.

'మాలతి పెళ్లీ అయింది ... నువ్వేమంటావు' అన్నది సుజాత చిరునవ్వు పెదిమలపైకి రానిస్తూ.




సొసైటీ వారి 'ప్రపంచం' లో నొక నృత్యభంగిమము.




'ప్రపంచం' చిత్రంలో నాగయ్య.

# ★ చిత్ర సమీక్ష ★



## ప్రపంచం :

సొసైటీ పిక్చర్స్‌వారు మూడేళ్ళుగా సర్వశక్తుల కృషిజేసి దాదాపు 30 లక్షల రూపాయలదాకా ఖర్చుపెట్టి, ప్రసిద్ధనటీనట సమూహంతో తయారయిన చిత్రం జూలై 9 వ తేదీ పత్రికా రచయితలకోసం ప్రివ్యూ ఇవ్వబడింది. కొన్ని తరాలకుచెందిన కుటుంబ గాథ కావడం మూలాన్ని, అనేకమంది వ్యక్తులజీవితాలకి సంబంధించిన కథ కావడం మూలాన్ని ఈ చిత్రానికి "ప్రపంచం" అనే పేరు పెట్టారను కుంటాము.

### కథ

చలపతి అనే ఒక పేదయువకుడు. మీనా అనే అమ్మాయిని ప్రేమించి వివాహమాడుతాడు. వీరికి శంకర్, మోహన్ అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. అదృష్టంవల్ల చలపతి గొప్పవాడయాడు. తల్లిదండ్రుల ఇష్టప్రకారం శంకర్ పద్మ అనే అమ్మాయిని పెండ్లాడుతాడు. చందర్, స్వర్ణ వీరిసంతానం. మోహన్ వివాహవిషయంలో ఆధునిక భావాలు కలవాడు. సహాధ్యాయిని లలితప్రేమను తిరస్కరిస్తాడు. ఇంతలో చాలా కాలంనుండీ దక్షిణాఫ్రికాలో వుంటున్న మీనా సోదరుడు కుటుంబసమేతంగా స్వదేశానికి వచ్చేస్తాడు. ఉన్నత విద్యాభ్యాసానికి లలిత ఇంగ్లండుకు వెళుతుంది. మోహన్ మేనమామ కూతురైన లీలను ప్రేమిస్తాడు. చలపతి మరణిస్తాడు. లీల మెడికల్ విద్యార్థిని. లీలా మోహనుల ప్రేమ దినదినప్రవర్ధమాన మవుతుంది. లలిత బారిష్టరు పరీక్ష ప్యాసయి తిరిగివస్తుంది. మోహన్‌ను ఎలాగైనా వల్లో వేసుకోవాలని సర్వ విధాలా ప్రయత్నిస్తుంది కానీ అతడు చలించడు.

లీలమనస్సు మార్చడానికి చాలా ప్రయత్నిస్తుంది కానీ లాభంలేకపోతుంది. లీలగర్భవతినని గ్రహించి డాక్టర్ నిర్మలకి (కాలేజీప్రొఫసర్) తెలియజేస్తుంది. ఆమె మోహన్‌ని లీలఇంట్లో కలుసుకోమని ఫోను చేస్తుంది. "చెరపకురా చెడెదవు" అన్నట్లు లీలను చంపడానికి బాకుతో పరుగెత్తుకొని వస్తున్న లలిత డాక్టర్ని కలుసుకోడానికి వస్తున్న మోహన్ కారు క్రిందపడి మరణిస్తుంది. లీలా మోహనులకు వివాహం జరుగుతుంది.

మోహన్ అమెరికాకు వెళతాడు. శంకర్ భార్య పోయి రెండు నెలలన్నా కాకముందే, ప్రేమ అనే బీదపిల్లను చేసుకునేందుకు ప్రయత్నిస్తాడు. మళ్లీపెళ్ళి చందర్‌కి ఎంతమాత్రము ఇష్టములేక తండ్రితోవాదించి వెళ్లిపోతాడు. ఈవయసు మళ్ళిన రెండోపెళ్ళివాడిని పెళ్లాడ్డానికి ఇష్టంలేక ప్రేమ సముద్రములో పడుతుంది. చందర్ ఆమెను రక్షించి ఆసుపత్రిలో చేరుస్తాడు. ప్రేమ పరిస్థితి చాలా ఆందోళనకరంగా వుండడంచేత చందర్ రక్తదానంచేసి బ్రతికిస్తాడు. దర్యాప్తుకనివచ్చిన పోలీసు ఇన్‌స్పెక్టరు ప్రేమను ప్రేమిస్తాడు. కానీ ప్రేమ ఇదివరకే తనహృదయం చందర్‌కి అర్పించడం మూలాన్ని అతనిప్రేమ నిరాకరిస్తుంది. ఇందుకు వారిమీద ఆత్మహత్యానేరంమోపి తప్పుడుకేసులో ఇరికిస్తాడు. ఇది ఇట్లావుండగా అమెరికానుండి తిరిగివచ్చిన మోహన్ లీలాచందర్లు చనువుగా తిరగడంచూసి అనుమానిస్తాడు.

లీలమెడ నులిమి చంపబోయేసమయానికి చందర్ వచ్చి తప్పంతా తనదేనని నిజంచెప్పి వెళ్ళిపోతాడు. సక్రమమైన విచారణ జరగటం మూలాన్ని ఇన్‌స్

పెట్టరు తప్పు బయటపడుతుంది. ప్రేమాచందర్ల వివాహంతో కథపూర్తి అవుతుంది. ఈ చిత్రంలో మీనా చలపతి, పద్మాశంకర్, లీలామోహన్, ప్రేమాచందర్ల ప్రేమా, ప్రేమ ఫలితాలూ చూస్తాము. ఈ చిత్రనిర్మాత శ్రీ ఎం. హెచ్. ఎం. మూనాస్ గారు. వారి సతీమణిగారు ఈ కథ వ్రాశారు. శ్రీశ్రీగారు తెలుగులో రాసినపాటలు మాటలు బాగా వున్నాయి. ఈ చిత్రానికి దర్శకులు శ్రీ ఎల్. ఎస్. రామచంద్రన్ శ్రీ తిరువేంగడం. సంగీతం హిందీ మట్టులో వినడానికి శ్రావ్యంగావుంది. నటీనటవర్గంలో లలితగా లక్ష్మీకాంత, లీలగా జి. వరలక్ష్మి, ప్రేమగా జానకి, మోహన్‌గా రామశర్మ, చందర్‌గా వల్లం నరసింహారావు అమోఘంగా నటించారు. ఛాయా శబ్దగ్రహణాలు బాగా నేవున్నాయి. దారాసింగ్, ఆలీరిజా బేల కుస్తీ, పులితో పోరాటం, బాణసంచాల కాల్పులు, బేబీకమల, లలితాపద్మినీల నాట్యభంగిమ ములు చిత్రాన్ని మరింత ఆకర్షణీయంగా చేసాయి. ఈ చిత్రం విశేషంగా ప్రజల ఆదరాభిమానములకు పాత్రము కాగలదని మా నమ్మకం.

యమ్. సుశీలాదేవి.

# భారతీయ భాషా సాహిత్యాలను తరచి చూచిన ప్రఖ్యాత సోవియట్ శాస్త్రజ్ఞుడు



భారతీయ భాషలలోనూ, సారస్వతంలోనూ ప్రధాన సమస్యల పరిష్కారానికి బరెన్నికోవ్ అనేక సంవత్సరాలు కృషి చేశారు. ఆయన సుమారు రెండువందలకు పైగా శాస్త్రీయ రచనలు చేశారు. "గద్యాత్మకమైన హిందీకి సంబంధించిన సమస్యలు" "ఉర్దూ సారస్వతం" ఒక చిన్న వ్యాసం, "నూతన భారతీయ సారస్వతాల చరిత్ర" ఒక చిన్న వ్యాసం," "రష్యన్ సాహిత్యం భారతీయులు," "గోర్కీ-భారతీయ సాహిత్యం," "అలెగ్జాండర్ సెర్జియెవిచ్ పుష్కిన్ గురించి భారతీయ సాహిత్య విమర్శకులు,"-ఇవి ఆయన రచనలలో కొన్ని. భారతీయ భాషాశాస్త్ర సాంప్రదాయాలను చారిత్రకంగా పోల్చిచూసే పద్ధతిలో పరిశీలించడం గురించి ఒక పరిశోధక గ్రంథాన్ని ఆయన ఇటీవల రచించారు.

భారతీయ సాహిత్యంగురించి సోవియట్ ప్రజలకు పరిచయం చెయ్యడానికి బరెన్నికోవ్ చాల కృషిచేశారు. ప్రసిద్ధభారతీయ ఇతిహాసిక గ్రంథం తులసీదాస్ విరచిత రామాయణాన్ని ఆయన అనువదించేరు; ఇదీ, ఆయన అనువదించిన ఇతర భారతీయ సాహిత్య గ్రంథాలు సోవియట్ దేశంలో ప్రచురింపబడ్డాయి. అనేక భారతీయ-రష్యన్ నిఘంటువులను తయారు చెయ్యడంలో బరెన్‌కోవ్ చాల తోడ్పడ్డారు.

అపారంగా శాస్త్ర పరిశోధన, విద్యాబోధనలు సాగించడం మాత్రమే కాకుండా బరెన్నికోవ్ పౌరజీవిత కార్యకలాపాల్లో కూడా పాల్గొన్నారు. ఆయన లెనిన్‌గ్రాడ్ నగరసోవియట్‌కు సభ్యుడుగా అనేక సార్లు ఎన్నుకోబడ్డారు. శాస్త్రవిజ్ఞానానికి ఆయన చేసినసేవ మూలంగా ఆయనకు ఆర్డర్ ఆఫ్ లెనిన్ బహూకరింపబడింది.

సోవియట్ ప్రాచ్యవిద్యా పరిశోధనారంగానికిఆయనమరణం పెద్దనష్టం. ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు, దేశభక్తుడు ఆయన అకెడిమీషియన్. ఎ. బి. బరెన్నికోవ్ స్మృతి ఎల్లకాలం హృదయాలలో నిలచివుంటుంది.

టాస్ నుండి

# ఇంటిపనులలో మెళుకువలు

శ్రీమతి సి. లక్ష్మీపున్నయ్య

గృహనిర్వహణము చాల బాధ్యతతో కూడినది. ఉన్నంతలో తనూ, తన బిడ్డలు, భర్త సుఖంగా కాలక్షేపము చేయగల అవకాశములను రూపొందించగలది గృహిణి. ఇందుకు గృహములోని అందరి సహకారము చాల ముఖ్యము.

ముఖ్యంగా తన గృహావసరములను గుర్తించి సమకూర్చుకోవలసినది ఇల్లాలు. ఒక గృహంలో తన భర్త సంపాదన కూటికి, గుడ్డకే చాలీచాలని పరిస్థితులలో మట్టిబొమ్మలకని, విలువగల ఆభరణములకని, గుడ్డలకని ప్రాకులాడితే అప్పులపాలు కావడం, కూడుగుడ్డకరువు సంభవిస్తుంటవి. వచ్చే ఆదాయాన్నిబట్టి ప్రధానావసరములేవియని గుర్తించి వ్యవహరించిననాడుగాని కుటుంబంలో శాంతి సౌఖ్యాలు సమకూరలేవు.

ఇక యిండ్లలో పనిపాటలు చేయడానికి నియమించుకొనిన పనివాళ్లతో ఎలాగ మెలగాలనే విషయం అత్యంత ప్రధానమయింది. తమస్థితిమితాన్ని అనుసరించి జీతం నిర్ణయం చెయ్యడం, ఉన్నంతలో పెట్టకలిగితే అన్నం పెట్టడం జరుగాలి.

తమ మనస్తత్వాన్నిబట్టి కొంతకాలం అతిచనువుగాను, మరికొంతకాలం చాల కఠినంగా వ్యవహరిస్తే గృహంలో అశాంతి చెలరేగడం సహజం.

చేయవలసినపని చేయించుకోడం, అనుకొనిన ప్రకారం పనివాళ్లకు డబ్బురూపేణాకాని, భోజనరూపేణాకాని ముట్టచెప్పడం జరుగాలి. పనిమనిషిలో లోపంకనుపించినప్పుడు దండించాలి. ఒకసారికి రెండుమూడుసార్లు ఆలోపాలే కనుపించినప్పుడు పనినుండి నిలిపివెయ్యాలి. అంతేకాని వారితో నసగా వాదులాట పనికిరాదు. దానివలన చుట్టూఉన్నవాళ్లకు చీకాకు, పనివాళ్ల దృష్టిలో చులకన ఏర్పడటం సహజం.

ఇక యింటికి అవసరమైన సామానులు డబ్బుపెట్టితెచ్చినంత మాత్రాన గృహిణి బాధ్యతతీరదు.

తెచ్చినవానిలో శుభ్రపరచవలసినవానిని శుభ్రపరచి ఎందులోనుంచవలసినవానిని అందులో వుంచి మూతలు పెట్టవలసియున్నది. అందులోను ప్రతిదినమును వాడుకలోనుండువానిని గుర్తుగా నుంచుకొని వాడుకుంటూ యుండాలి. ఏమరుపాటుననైనను మూతలుంచడం మరచిపోతే దుమ్ము, ధూళి, పురుగులుపడటమో లేక ఎలుకలకు, పందికొక్కుల వాతపడటమో జరుగుతుంటుంది.

తెచ్చిన సామానులనయినా పొదుపుగా వాడటం అలవాటుచేసికోవాలి. తిన్నంతతిని ఎగాదిగా పారబొయ్యడంలో లాభంలేదు; పైగా కుటుంబంలో లోటు ఏర్పడుతుంది. ఒక సాధారణ కుటుంబంలో అన్నసాధకములుగా రెండుమూడు వంటకాలు చేసికుంటారు. కాని రెండుమూడురోజుల కుంటవికదాయని రెండురూపాయలుపెట్టి కాయగూరలు తెస్తే మొత్తాన్ని రెండు రోజులలో వినియోగిస్తే ఆ యిల్లాలు ఏపాటి జాగ్రత, బాధ్యతగలది అనగలం? తినే ఆహారం శుభ్రంగా, సుచిగా నుండాలికాని స్థితిమితానికి మంచి సాధకాలు చేసికొని తినవలెననుకోడం క్షేమకరంకాదు.

కుటుంబంలో ఎంతసేపటికీ ఒక పద్ధతిని, శాంతియుతవాతావరణమును సమకూర్చవలసినది గృహిణి. బాధ్యతా రహితంగాగాని, ఉదాసీనతతోగాని గృహిణి వ్యవహరించిననాడు కుటుంబంలో అన్నియు అవకతవకలుగానే యుండగలవు.

———o———




# యుక్తిగల ఇల్లాలు

'నారపీచు'

ఒక యిల్లాలికి యిద్దరు కుమారులు. ఆమె భర్త చనిపోగానే కుమాళ్ళిద్దరు భార్యలతోటి ఆస్తిపాస్తులు పంచుకొని వేరుబడ్డారు. ఆమెను మాత్రం కొడుకులుగాని, కోడళ్లుగాని ఆదరించకుండా కూటికి గుడ్డకు కరువేర్పడి కష్టాలకు గురియయింది.

ఆ యిల్లాలు చాలమంచిది; దైవభక్తురాలు కూడాను. ప్రతిదినము భగవన్నామస్మరణ చేస్తూ తన కష్టాలను భగవంతుని ఎదుట మొరబెట్టుకునేది. ఒకనాడు కలలో పరమేశ్వరుడు కనుపించి ఆమెను కొడుకులు, కోడళ్లు ఆదరించడానికి ఒక యుక్తిచెప్పి మాయమయ్యాడు.

మరునాడు ఒక నింపిన గోనెసంచిని యూళ్లోవాళ్లకు చూపి దాంట్లో అమూల్యములైన నగలు, డబ్బుయున్నదనియు, తన్ను పోషించినవారి కాసంచి యిస్తానని చెప్పడం మొదలుపెట్టింది. ఇది తెలిసి పెద్దకొడుకు, కోడలు పరుగెత్తుకొనివచ్చి ఆప్యాయంగా ఆ యిల్లాలిని పోషిస్తామంటూ యింటికి తీసికొని వెళ్ళారు. ఇది తెలిసి చిన్నకొడుకు, కోడలు ఆదరాబాదరా వెళ్ళి తమ యింటికి రమ్మని ఆ యిల్లాలిని బ్రతిమలాడారు. అప్పుడు ఆ యిల్లాలు యిద్దరు కొడుకులతోటి, కోడండ్రతోటి "మీరు వాదులాడుకోకండి; మీరంతా నాకు సమానమే. ఆరునెలలు పెద్దవాడియింట్లో, ఆరునెలలు చిన్నవాడియింట్లో యుంటూ నా జీవయాత్ర గడుపుతాను. నా అనంతరము యీ సంచిలోని దానిని మీరు సమానంగా పంచుకోండి. అంతవరకు యీసంచి నాదగ్గరే యుంటుంది" అని చెప్పింది.

ఆమె చనిపోగానే కొడుకు లిద్దరూ పంచుకోడానికి సంచివిప్పి చూడగా చిత్తు కాగితాలు, చినిగిపోయిన గుడ్డలు, కుండపెంకులు కనుపించాయి. వానిని చూచి సిగ్గుపడి తాము మొదట్లో ఆమెకు ద్రోహము చేసినందుకు తగినశాస్తి జరిగిందనుకున్నారు.

బాలలారా! చూచారా ప్రతిపనిలో యుక్తి తెలిసియుండాలి. అది ఎంతటి కష్టమైన పనినైన సునాయాసంగా నెరవేర్చుట కుపయోగపడుతుంది.




**గేయసుమాల:** విద్వాన్ తలమర్ల కళానిధి, తెలుగుపండితుడు, ఆర్. యల్. హైస్కూలు, అనంతపురం.

ఇందలి గేయములు సులభశైలిలో సామాన్య ప్రజానీకపు అనేక సమస్యలను సంబంధించినవిగా నున్నవి ఇవి చదువను చదువను ఉత్సాహాన్ని రేకెత్తిస్తూ మనోజ్ఞంగా నున్నవి.

**శ్రీవివాహమహోత్సవము – ఆశిషప్రసవ మంజరి:**

ఈచిన్న పుస్తకములో శ్రీ ఆచంట సూర్యనారాయణమూర్తిగారి పుత్రిక చి. సౌ. కమలం శ్రీ హారాచిట్టి రాజుగారి ప్రథమ పుత్రుడు చి. లక్ష్మణమూర్తికి జరిగిన వివాహమహోత్సవ సందర్భమున కవి, పండిత, మిత్రులు అభినందిస్తూ చెప్పిన పద్యములు. వివాహవేదికలమీద యిట్టి పద్యములు ఆశీస్సులు గాను, అభినందనలుగాను చదవడం మనలో ఆచారం. పద్యవాఙ్మయం యీవిధంగాకూడ ప్రాణించుచుండటం సంతోషింపవలసిన విషయం. నూతనదంపతులకు మా ఆశీస్సులు.

**'ఆర్థికసమత'** ప్రథమ సంచిక మా కార్యాలయమునకు చేరినది.

ఈ పత్రికయొక్క ఆశయము, కార్యక్రమము పేరునుబట్టియే తెలిసికొననగును. అంటే ఆర్థికరంగంలో సర్వప్రజానీకం సమత్వమును సాధించడానికి జరిగే కృషిని ప్రోత్సహిస్తూ, నిర్మాణాత్మకంగా ఆయుద్యమము నకు చేయూతగా నుండుటయే యీ పత్రిక ఆశయము.

ఈ పత్రిక ఆశయము సిద్ధించిననాడు ప్రజల కష్టాలు గట్టెక్కినవన్నమాట ! అంటే ప్రజలు, పత్రిక కలసి నిర్విరామంగా పరస్పర సహకార సానుభూతులతో ఏకోన్ముఖంగా ఆశయసిద్ధికి కృషిచెయ్యాలి. ప్రజలు ఈ పత్రికను తమ పురోభివృద్ధికి వినియోగించుకోగలరనుటలో సందేహంలేదు.

సంపాదకులు శ్రీ లవణం ; సాలుచందా రు. 6-8-0 విడిపత్రిక 0 2-0 కార్యస్థానం పటమట, (వయా) విజయవాడ.

**హాలికగీత :** శ్రీ దూతలూరి జగన్నాథం, అన్నధారి, ఊతుకోటపోష్టు, (వయా) తిరువళ్లూరు, చెంగల్‌పట్టు జిల్లా వెల 0-8-0.

ఇది ఖండకావ్యము. మానవ లోకానికి వెన్నెముకవంటివాడు రైతు. కూడు, గుడ్డలాంటి ప్రధానావసరములను తీర్చునట్టి రైతు జీవితమును వస్తువుగా తీసికొని యీ కావ్యము వ్రాయబడింది. ఇందులో రైతుయొక్క స్వార్థగహితమైనకృషి, నిరాడంబర జీవితము, పరోపకారచింత మొదలగు వానిని మనోహరంగా చిత్రిస్తూ ఆ కష్టజీవిని యీ కావ్యంలో స్మరించాడు.

ఇందులోని పద్యములనడక సరళంగాను, మనోజ్ఞంగానున్నది. విశేషంగా ప్రజాదరణకు పాత్రము కాగలదని మా నమ్మకము.

భగవత్ప్రాప్తి - ఉపాయములు : అనువాదకులు : శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య, బులుసు సూర్యప్రకాశశాస్త్రి ; ప్రకాశకులు సాధన గ్రంథమండలి, తెనాలి. వెల 0-4-0

సాధనగ్రంథమండలివారు అధ్యాత్మిక గ్రంథములనేకములను వెలువడజేశారు. అందులోనిది యొకటి. ఇందులో భగవంతుని దరిచేరుటకుగల మార్గములు వివరించబడినవి. అందులో ఒకదానినిగాని, అన్నిటినిగాని, లేదా వానిసారాంశమునుగాని అవగాహనముచేసికొని భగవత్ సాన్నిధ్యమునకు చేరుకొనుట కీగ్రంథము ఎంతైన ఉపకరించగలదు.

హరినామ మహిమ శతకము : శ్రీ నీలకాంతగోస్వామి. ప్రకాశకులు సాధన గ్రంథమండలి, తెనాలి. వెల 0-4-0

భగవన్నామ సంకీర్తనము నుద్దేశించి అనేక శతకములు వెలసినవి. ఈ చిన్న పుస్తకముకూడ యిందు కుద్దేశించబడినదియే.

ఇందులో గ్రంథకర్తచే రచింపబడిన సంస్కృత శ్లోకములు, శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారిచే అనువాద తెలుగు తాత్పర్యముకలవు.

మోక్షసాధనకని ఉద్దేశించబడిన మార్గములలో భగవన్నామస్మరణయొకటి. అందుకుగాను శతక వాఙ్మయము విశేషంగా నుపకరించింది. ఈ చిన్న పుస్తకము యీ వాఙ్మయ సంపదను పెంపుగావించుచు ప్రజాదరణ పొందగలదని మా విశ్వాసము.



"రానురాను మా మేనేజరు నన్ను కుక్కలా చూస్తున్నారు"

"నీవు ఆయనదగ్గర తోక ఆడించి యుంటావు."

♦ ♦ ♦

"ఏమే లక్ష్మీ నేను నీతో చెప్పిన మాటను జానకితో చెప్పవద్దంటినే ఎందుకు చెప్పావు"

"అది నీతో చెప్పింవావేమిటె - నేను దానితోటి నేను చెప్పిన దానిని మరెవ్వరికి చెప్పవద్దన్నానే!"

"పోనీలే! నేను నిన్ను అడిగానని మరల దానితో చెప్పవాక"

# సంపాదకీయములు

## నిరుద్యోగ సమస్య

మద్రాసు రాష్ట్రప్రభుత్వము రాష్ట్రంలోని పట్టభద్రులందరికి కమ్యూనిటీ ప్రాజక్టుల నిర్వహణ సందర్భమున ఉద్యోగములు యిప్పించడానికి ఒక పథకాన్ని తయారుచేస్తున్నదని వార్తలువిని అభినందిస్తున్నాము.

కాని పట్టభద్రులుకాని వారి విషయమేమిటి? స్కూలుఫైనలు, మాధ్యమికవిద్య నభ్యసించినవారి సంఖ్య పట్టభద్రుల సంఖ్యకంటె చాలఅధికము; పైగా మధ్యతరగతి, బీదప్రజానీకమునకు సంబంధించినవారు. అంటే అందులో తమ ఆస్థిపాస్తుల నమ్ముకొని ఉద్యోగాల ఆపేక్షతో విద్యనభ్యసించినవారు అధికం. వీరు అనేకమంది నిరుద్యోగులై కూటికి, గుడ్డకు కరువైనవారు చాలమంది. కాబట్టి వారివిషయం రాష్ట్రప్రభుత్వం అధికంగా శ్రద్ధవహించవలసియున్నది.

పట్టభద్రులయినవారు అధికసంఖ్యాకులు ఆర్థికస్థిమితముగలవారు. విద్యాధికులు కాబట్టి వారికొరకనే ఎదురుచూచే బాధ్యతా పూరితమయిన ఉద్యోగాలు చాలయుంటవి, కాబట్టి మద్రాసుప్రభుత్వము పట్టభద్రుల విషయంతోబాటు స్కూలుఫైనలు, మాధ్యమికవిద్య నభ్యసించినవారికి కూడ ఉద్యోగాలు సమకూర్చడానికి ప్రయత్నము చేయవలెను.

## ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము-శాసనసభ్యులు

మద్రాసు శాసనసభలో సంప్రతింపబడనున్న ఆంధ్రరాష్ట్రబిల్లు ప్రచురించబడింది. దానిని పరిశీలించి తమకు ఏర్పడనున్న రాష్ట్రమునకు న్యాయము జరుగునట్లు పార్టీ, వర్గవిచక్షణకు లోబడకుండా చూడవలసిన బాధ్యత శాసనసభ్యులపైనున్నది. ఇందులకు విశాలదృక్పథము చాల అవసరము.

రాష్ట్రనిర్మాణ సందర్భమున ఆస్తులు, అప్పులపంపకాలు, ప్రాజక్టుల నిర్మాణమునకు సంబంధించిన వ్యవహారములు, ఉద్యోగుల పంపిణీలు మొదలగు అనేక సమస్యల పరిష్కార సందర్భమున ఏమాత్రము సంకుచితముగానో లేక ఉదాసీనతతోనో వ్యవహరించినచో తీరని నష్టము ఏర్పడి, తద్వారా రాష్ట్రశ్రేయస్సుకే భంగము ఏర్పడగలదు.

ఇకనైనా తాత్కాలిక రాజధాని నగరనిర్ణయమును గురించి వాదోపవాదములు నిలిపివేయడం సమంజసం. రాయలసీమ వెనుకబడియున్న ప్రాంత్యము. అందులోని పట్టణాలు సయితం సర్కారు జిల్లాలయందలి పట్టణములతోబాటు అభివృద్ధిగాంచవలసిన అవసరం రాష్ట్రశ్రేయస్సు, పురోభివృద్ధి, యావదాంధ్ర ప్రజానీకపు ఐకమత్యముల దృష్ట్యా మెండు. వీనిని సాధించిననాడేగాని విశాలాంధ్ర సాధన కవకాశములులేవు.

కర్నూలు నగరాన్ని తాత్కాలిక రాజధాని నగరంగా రూపొందించే సందర్భములో వీలైనంత తక్కువ ఖర్చుతో జరుగాలి. రాజధాని నగరం సమకూరినంతమాత్రమున రాయలసీమవారికి ఆర్థిక పురోభివృద్ధి సమకూరదని వాదించడం పొరబాటు. వారిలో నూతనోత్సాహము కలుగడంతోబాటు బాధ్యతతో నలుగురితోబాటు వ్యవహరిస్తారు. రాజధాని నగరంతోబాటు వారి పురోభివృద్ధికవసరమయిన ప్రాజక్టుల

నిర్మాణానికి, వర్తకవ్యాపారాల నిర్వహణలోను అఖిలాంధ్రప్రజానీకం ఉమ్మడిగా కృషిచెయ్యవలసి యున్నది.

రాజధానినగరాలు కానంతమాత్రాన బెజవాడ, గుంటూరునగరాలకు రాగల నష్టంగాని, సమకూర వలసిన పురోభివృద్ధిగాని కుంటుపడదుకాని కర్నూలు యీ సమయంలో తాత్కాలిక రాజధానియైనా కాక పోయినచో ఆ నగరానికిగాని, రాయలసీమ ప్రాంత్యానికిగాని పురోభివృద్ధి కనుచూపు మేరలో లేదని సర్కారుజిల్లాలవారు గుర్తించి సానుభూతితో కర్నూలును తాత్కాలిక రాజధానిగా ఆమోదించడం శ్రేయస్కరం.

## ఏలూరు స్త్రీల కళాశాల

మహిళాలోకంలో విద్యావ్యాప్తి అభివృద్ధిదశలోనుండటం అభినందనీయం. ఇందుకు ప్రభుత్వమే కాక సంపన్నులు సయితం భూరి విరాళములనిచ్చి విద్యాలయముల స్థాపనకు అవకాశములు కలుగ చేస్తున్నారు.

ఈ సందర్భమున ఏలూరు స్త్రీల కళాశాలకు లక్షరూపాయల విలువగల 100 యకరముల భూమిని దానముచేసిన శ్రీ చింతలపాటి సీతారామచంద్రమూర్తిరాజు అభినందనీయులు. మహిళావిద్యావ్యాప్తికి వీరిప్రోత్సాహము చిరస్మరణీయమేకాక శాశ్వతయశస్సును సమకూర్చగలదు. సంపన్నగృహిణులు యిట్టి ప్రోత్సాహమును యింకా ఎంతైనా చేయవలసియున్నది.





'ప్రపంచం' లో రామశర్మ.

# శ్రీ విజయనామ సం॥ర ఆషాఢ-శ్రావణమాసములు

| | | | |
|---|---|---|---|
| 1953 సం॥ జూలై నెల | 16 | గు | పం 19-41 పూఫ 3-12 షష్ఠితిథిః దక్షిణాయనపుణ్యకాలం |
| | 17 | శు | ష 24-9 ఉ.ఫ 9-14 రా 10-21 శూన్యతిథిః |
| | 18 | శ | స 28-26 హ 15-26 హ 15-6 రా 5-1 పుష్య 2 వక్రిస్వాధ్యాయః |
| | 19 | ఆ | అ 32-19 చి 20-39 సిద్ధ 22 4 |
| | 20 | సో | న 35-32 స్వా 35 34 రా 8-35 సత్యాదిరాజతీర్థానాం, పుణ్యదినం |
| | 21 | మం | ద 37-47 విశా 29-38 |
| | 22 | బు | ఏ 39-10 అనూ 32-40 అమృతసిద్ధియోగం, |
| | 23 | గు | ద్వా 39-0 జ్యే 34-33 రా 22-53 ప్రదోషద్వయం |
| | 24 | శు | త్ర 37-44 మూ 35-12 |
| | 25 | శ | చతు 35-13 పూ.షా 34-37 |
| | 26 | ఆ | ○ షా 31-33 ఉషా 32-54 వ్యాసపూజా, చంద్రగ్రహణం |
| | 27 | సో | బ.పా 26-53 శ్ర 30-7 అమృతసిద్ధియోగం |
| | 28 | మం | విదియ 21-22 ధని 26-31 తిథిద్వయం |
| | 29 | బు | తృ 15-14 శత 22-19 దగ్ధయోగం |
| | 30 | గు | చ 8-45 పూభా 17-48 అతి 30-57 |
| | 31 | శు | పం. 2-7 ఏష్యం 53-25 తై 2-7 |
| 1953 సం॥ ఆగస్టు నెల | 1 | శ | స 49-28 రే 8-51 అహా 31-41 |
| | 2 | ఆ | అ 44-6 అశ్వ 4-57 దివి 27-43 అమృతయోగం |
| | 3 | సో | న 39-35 భ 1-44 దివి 30-28 |
| | 4 | మం | ద 36-9 రో 58-1 రా 6-48 |
| | 5 | బు | ఏ 33-53 మృ 58-4 త్యా 4-18 |
| | 6 | గు | ద్వా 32-50 ఆర్ద్ర 59-19 ది 19-23 |
| | 7 | శు | త్ర 33-1 పున 60-1 ది 30-41 అమృతయోగం |
| | 8 | శ | చతు 34-24 పున 2-4 దివి 23-18 మాసశివరాత్రిః |
| | 9 | ఆ | ● అమా 36-49 పుష్య 5-38 చతు 5-32 జ్యోతిర్భీమేశ్వరవ్రతం |
| | | | **శ్రా వ ణ మా స ము** |
| | 10 | సో | శుద్ధపాడ్యమి 40-7, శ్లే 10-8 రాఘవేంద్ర తీర్థానాం పుణ్యదినం |
| | 11 | మం | ద్వి 44-6 మ 15-24 మంగళగౌరీవ్రతం |
| | 12 | బు | తృ 48-30 పూఫ 21-8 స్వర్ణగౌరివ్రతం |
| | 13 | గు | చ 53-2 ఉఫ 27-8 రా 18-24 శుభాయోగం |
| | 14 | శు | పం 57-27 హ 33-5 నాగపంచమి |
| | 15 | శ | ష 60-10 చి 38-45 రా 22-39 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd
15. Westcott Road, Royapettah, Madras.
Founder-Editor: Dr. K. N. Kesari; Ag. Editor: C. C. Punnieh.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

